THIS BOOK IS BY KIND PERMISSION

DEDICATED TO

P. B. THOMAS ESQ.,

DEPUTY INSPECTOR-GENERAL OF POLICE,

MADRAS PRESIDENCY.

# FOREWORD.

The serious attention which both the Government and the public at large have been lately bestowing on the question of effectively dealing with the criminal gangs of South India is my apology for this work. Close observation of the habits and ways of criminal gangs has always appealed to me as a particularly interesting branch of Police Work. Each tribe has its own tradition and history. Awe-inspiring stories as to how groups of these men with their Donga Guru (Master thief) at their head used to infest the country and sally forth the neighbouring villages to loot, plunder and commit dacoities often in broad daylight are only too common. The Donga Yerukalas of the Circars, the Korachas f the Ceded Districts and the Koravars of the Southern Districts still set at naught the public peace and tranquility. Thanks to the reorganization of the Police and the establishment of criminal settlements by the Government and Salvation Army, by which the atrocities of the criminals have of late somewhat diminished, though it must be admitted that it will take a long time still to

rid the country altogether of the dread of these tribes.

Modern conditions of city and village life have necessitated a relative change in the methods employed by these criminal gangs in following their time-honoured vocation. No doubt all these gangs have some general features of resemblance in their life conditions; yet there are some special and specific points which mark each particular gang. It has been my endeavour to lay stress on these special characteristics, so that it may be helpful to the Village Headman and the Police in tracing these criminal gangs and bringing them to Justice.

As the book is intended also for the benefit of the general reading public, I have purposely adopted as homely a style as possible. Any helpful suggestions will be thankfully received and made use of in the next edition.

I am highly indebted to the Criminal Intelligence Department, Madras, who helped me in the publication of this work by kindly placing their records at my disposal.

My grateful thanks are specially due to E. J. Rowlandson Esquire, Principal, Police

Training School, Vellore, and H. E. Williams Esquire, Personal Assistant, Criminal Intelligence Department, Madras, for the great help they have rendered me in bringing my object to fruition; and to M. R. Ry. Rai Bahadur M. Pauparao Naidu Garu, the veteran Police Officer of this Presidency who has very kindly gone through my book in manuscript and given me for my use his notes on the Dandasis of the Ganjam District besides making some very valuable suggestions.

My thanks are also due to M. R. Ry. Nott. Subbarau Garu, Chief Law Instructor, Central Recruits' School, Vellore, who has encouraged me in my undertaking.

VELLORE,
*3rd April 1916*

E. RAMACHENDRA SASTRI.

## విషయసూచిక.

---

# మొదటి భాగము-చెన్నపురి రాజధాని.



# దొంగ దాసర్లు.

మొదట దాసర్లు అనేక జాతులవారు. వీరీ రాజధాని యందంతట నున్నారు కాని అందరు నేరములు చేయువారు కారు. కర్నూలు, గుంటూరు, నెల్లూరు, గోదావరి, కృష్ణా జిల్లాలలోను, హైదరాబాదురాజ్యమందును నేరములు చేయు దొంగదాసర్ల నెరుగనివారులేరు. వీరు గజదొంగలు. ప్రస్తుతము కర్నూలు, కడప, బళ్లారి, చిత్తూరు జిల్లాలలోనున్నవారు దొంగదాసర్లనియు, నెల్లూరు జిల్లాలో నున్నవారు కత్తెర వాండ్రనియు, గోదావరి జిల్లాలోనున్నవారు పచ్చెపవాండ్ర నియు పలురీతుల పిలువబడుచున్నను వీరందరు నొక తెగవారె. వీరి వృత్తాంతములు సంగ్రహముగ నీక్రింద వ్రాయబడును.

## 1. దొంగదాసర్లు.

వీరు తమను కనిపెట్టగల పోలీసు ఉద్యోగస్తుడు లేని గ్రామములయందు నివసింతురు. ఏగ్రామములోనైన నేరములు చేయదలచుకొనిన ఆగ్రామమునకు బయట కొంతదూరమందు చెట్లచే నావరించబడి, నీటి సదుపాయముగలచోట్ల నుందురు. పెద్దపట్టణములకు వెళ్లినప్పుడు ఆపట్టణముల బైట జనులు పోని ప్రాంతముల నివసింతురు.

వీరు కర్నూలు, కడప, నెల్లూరు, చిత్తూరు, గుంటూరు గోదావరి, కృష్ణా, విశాఖపట్నం జిల్లాలలోను, నైజాం రాజ్యములోను, నేరములు జేయుదురు.

స్త్రీ పురుషులు అందరు అమితముగ త్రాగుదురు. కావలసిన భోజన పదార్థములను తెచ్చిపెట్టుటకు వీరికన్న తక్కువ జాతివారితో స్నేహము చేయుదురు. పురుషులు నేరములలో పట్టుబడినప్పుడు స్త్రీలు వీరిని విడిపించుకొనుటకు అనేక ప్రయత్నములను జేయుచు చివరకు దేనికైనను లోబడుదురు. వీరు అరుదుగ రయిలుప్రయాణము చేయుదురు. వీరి స్త్రీలు తమతెగవారితో నెంత వ్యభిచరించినను, ఇతర పురుషులవలన తమకు గల్గు బిడ్డలకు నేరములు చేయుటలో వంశపారంపర్యముగవచ్చు తెలివితేటలుండవని వీరికి దృఢముగు నమ్మకముండుటచే నితరులతో నెంతమాత్రము వ్యభిచరించరు.

వీరు తెలుగు, హిందుస్థాని, అరవము మాట్లాడుదురు గాని తెలుగు,అరవము కలిసినభాషను తరుచుగ మాట్లాడుదురు.

వీరు బిచ్చమెత్తియు, ఈతచాపలు అమ్ముకొనియు, జీవనము చేయుదురు.

వీరు నేరములు చేయుటకు ఇతరజిల్లాలకు వెళ్లునప్పుడు వేరువేరు దుస్తులు ధరించి తాము దాసర్లమనియు, పూసల తెలగాలమనియు, బలిజీలమనియు, పశువులవర్తకులమనియు, ప్రక్కగ్రామమునకు వివాహమునకు పోవుచున్నామనియును, వేషములకు తగినట్టు అడిగినవారికెల్ల బదులు చెప్పుదురు.

పోలీసు ఉద్యోగస్తుడు సమీపించునపుడు అతిజాగ్రతగనుండి వానినే చూచుచుందురు. వీరు దిగియుండు ఏస్థలమునకైనను పోలీసువారు పోయినయెడల, వారిరాక సంజ్ఞలచే తమవారికి దెల్పి పారిపోదురు. ఒకానొకప్పుడు పోలీసు ఉద్యోగస్థునిపై దౌర్జన్యముగూడ చేయుదురు. అడవులగుండ ప్రయాణముచేసి గాని రాజబాటలపై అతివేగముగ నడచిపోవుచుగాని ఇతరులను మోసపుచ్చెదరు. ఒకనిని ఏదైన అడిగిన మరియొకడు వానికి బదులు చెప్పును. తమను గురించి ప్రశ్నించు వారితో సాధారణముగ వీరి స్త్రీలు మాట్లాడ నారంభింతురు. ఇవి దొంగదాసరి తెగయొక్క లక్షణములు. పోలీసువారు వీటిని బట్టి సులభముగ వీరిని గుర్తించవచ్చును. వీరిని పట్టుకొన్నప్పుడు లంచమిచ్చి తప్పించుకొనుటకు వీరు ప్రయత్నించుదురు.

వీరు దోపిడి, బందిపోటు, కన్నపుచోరీలు మొదలగునవి చేయుదురు.

అయిదారుగురు పురుషులు కొందరు స్త్రీలతోను, పిల్లలతోను నేరములుచేయుటకు తమగ్రామమువదలి యితరులు తమను అనుమానించకుండుటకై కొంతదూరము అడవులగుండను మరికొంతదూరము రాజబాటలపైనను ప్రయాణము చేయుదురు. తమ ప్రయాణములలో కావలసిన వస్తుసామగ్రులను మూటకట్టుకొని మోసికొని పోవుదురు. మారువేషములకు కావలసిన దుస్తులు వగయిరాలుగూడ తీసికొని పోదురు. ఒకగ్రామములో నేరములుచేయ నిశ్చయించినప్పుడు వీరి ఆడవారు బిచ్చమునకై యింటింట తిరిగిగాని, పూసల

నమ్మిగాని, అంకాలమ్మ వేషముల వేసికొనిగాని ఆగ్ర
లోని యిండ్లగుట్టుమట్లు తెలిసికొనివచ్చి తమ మగః
చెప్పుదురు. మగవారుకూడ, కృష్ణాజనము, రాగిచెంబు
కాశికావళ్లు, శంఖము, జేగంట, శృంగ నాదము, నెమ
పింఛముల కట్టలు, దీపస్తంభములు, తమ వెంట తీసికొని
తులసి పూసలు, నామములు ధరించి వేరువేరు వేషములు
డంబముగ వేసికొని గ్రామములలో తిరుగుదురు. తమతో
తీసికొనిపోవు తాటి యాకు పుస్తకముల జూచి ప్రశ్న చెప్పు
టయు గూడ కలదు. దొంగతనము చేయదలచిన యిండ్లయొద్ద
కుక్కలున్న యెడలఅవి మొరుగకుండుటకై ఉమ్మెత్తగింజలపొడి
అన్నములో కలిపి వాటికి వేయుదురు. పిమ్మట పురుషులు
యింటిలోనికిప్రవేశించి దొంగతనముచేయ మొదలుపెట్టుదురు.
తలుపు గడియలదగ్గర కన్నము త్రవ్వి గొళ్లెములు తీయుదురు.
ఇంట్లో ప్రవేశించగనే కొందరు బరా కర్రలు పట్టుకొని
ఇంట్లోనుండువారిప్రక్కను నిలుచుందురు. మఱికొందరు ఆ స్త్రీని
దొంగిలించుచుందురు. వీరు నిద్రించువారి జోలికెంతమాత్రము
పోరు. వారి ఒంటినుండెడి నగలు దొంగిలించ దలచినపుడు
బలవంతముగ తీసికొందురు. ఎవరైన వీరిని పట్టుకొనదలచి
వెంబడించిన వారికెంత బాధనైనను కలుగజేసి తాముతప్పించు
కొని పారిపోవుదురు. వీరి పిల్లలు ఇతరుల మూటలు దొంగ
తనముగ విప్పుదురు. పసిబిడ్డల ఒంటిపైనుండు నగనాణ్యములు
కత్తిరింతురు. నేరములు చేయుటకు వీరు టక్కువడ్డర్లతోను,
దొమ్మర వాండ్రతోను, ఎరుకుల వాండ్రతోను తరుచుగ
జేరుదురు.

వడిసెలలు, కత్తులు, లాఠీలు, కత్తెరలు, గునపములు వీరు నేరముచేయు పనిముట్లు.

వీరు తాము దిగియుండు స్థలము జేరిన వెంటనే దొంగ సొత్తు ఆడవారిచేతి కిత్తురు. వారు విలువగు నగలుమాత్రము భూమిలో పాతిపెట్టి బట్టలు ఇతరులకు కనబడకుండ తమ గుడ్డమూటలలో దాతురు. దొంగసొత్తు మంచి సమయము చిక్కువరకు గాని తమగ్రామము జేరువరకుగాని తొందరపడి అమ్మరు. పిమ్మట అతి జాగరూకతతో దానిని తమ ప్రాపకులకుగాని, రిసీవర్లకు (దొంగసొత్తు కొనువారు) గాని అమ్ముదురు. వీరు దొంగసొత్తు నెంతమాత్రము తమయిండ్లలో నుంచక ఆచుట్టుప్రక్కల పాతిపెట్టుదురు.

వీరువిష్ణుమతస్థులు. రాముని పూజింతురు. వీరు తిరుపతి, భద్రాచలము, పోయి అచ్చట దైవములకు మ్రొక్కి పిమ్మట నేరములు చేయుటకు బయలుదేరుదురు.

---

## 2. కత్తెరవాండ్రు.

---

వీరు సాధారణముగ తమ ప్రాపకులుండు గ్రామ సమీపముల నివసింతురు. వీరొక గ్రామమున ఆగునపుడు చెరువులయొక్క పల్లపు ప్రదేశముల దిగుదురు.

వీరు దొంగతనములు చేయుటకు విశేష ప్రదేశము తిరుగుదురు. అందులో ముఖ్యముగ కర్నూలు, కడప, చెంగల్పట్టు, గుంటూరు, కృష్ణా, గోదావరి జిల్లాలలో నెక్కు వగ తిరుగుదురు.

వీరు బలాఢ్యులును, సాహసవంతులును. పురుషులలో చాలమందికి కనుబొమ్మలచివరనుగాని, రెండుకన్నులనడుమన గాని కాల్పుడు మచ్చలుండును. ఒకగ్రామమునుండి మరియొక గ్రామమునకు సులభముగ తీసికొనిపోవీలగులాగున ఈతచాపల తోను, వెదుళ్ళతోను కట్టుకొన్న చిన్న గుడిసెలే వీరియిండ్లు వీరి గుంపుతో జేరక వేరుగనున్న వీరి తెగవారు తలదాచ కొనుటకు గుడుసెలైననులేక ఎప్పుడును అడవిలో దాగియుందురు స్త్రీపురుషులందరు విశేషముగ త్రాగుదురు. మాల, మాదిగల తప్ప నితరజాతి స్త్రీలను దొంగిలించుకొనివచ్చి తమ భార్య లతో నివసించులాగుననే వారితోగూడ కాపురము చేయు దురు. వ్యభిచరించుట వీరిలో తప్పులేదు.

వీరు తెలుగు, హిందుస్తాని, అరవము మాట్లాడుదురు గాని తెలుగు, అరవము కలిసినభాషను తరుచుమాట్లాడుదురు

వీరు బిచ్చమెత్తియు, తరుచుగ ఈతచాపలను అల్లి అమ్ముకొనియు జీవింతురు.

పైగా నుండు వీరి తెగవారు పోలీసు నిగహాలోనున్న గుంపుతో చేరక, తమ భార్యా బిడ్డలను మాత్రము వారితో

విడిచి తాము రహస్యముగ వారు పోవు చోట్లకెల్ల వదలక వెంబడించుచు దొంగతనముగ వారిని చూచి పోవుచుందురు.

వీరు కన్నపుచోరీ, దోపిడి, బందిపోటు నేరములు జేయుదురు. స్త్రీలు స్వల్పచోరీలు జేయుదురు.

వీరు ఆడవారిద్వారాగాని, తమ ప్రాపకులద్వారాగాని లాభకరమగు సమాచారములు తెలిసికొందురు. బందిపోటు మొదలగు గొప్ప నేరములు చేయదలచినపుడు ఆరుగురు మొదలు పండ్రెండుగురువరకు గుంపుగ జేరిపోదురు. పశువుల వర్తకులవలె పలురంగులుగల రైలుసంచులు తీసికొని గ్రామములకు పోదురు. వీరిని చూచువారు వీరు నిజముగ పశువుల వర్తకులని భ్రమించులాగున చెవులకు తమ్మెట్లు, మొలకు వెండిమొలత్రాడు, పెట్టుకొని కాళ్ళకు చెప్పులు తొడుగుకొని బహు దర్పముగ కనబడుదురు. వీరొక గ్రామముచేరినతోడనే ఒక గొప్ప రైతు నింట బస దిగి భోజనపానాదు లచ్చటనే జరుపుకొందురు. పశువులను కొనుటకు ఇతరులకు కొంత సొమ్ము ముందుగనిత్తురు. ఈప్రకారముగ తమరున్న యింటి గుట్టుమట్లన్నియు బాగుగ తెలిసికొనువరకు నచ్చటనే యుండి పిమ్మట నాయింటిలోనున్న సొత్తంతయు దోచుకొనిపోదురు. నేరములు చేయుటకు నితరులతో వీరు విశేషముగ జేరరు. పట్టుపడుదుమని వీరికి భయము కలిగినప్పుడు మాత్రము దాక్షిణ్యముచేసి తప్పించుకొని పారిపోదురు. నేరముచేయునప్పు డేదైన ప్రమాదము రానున్నదని జాడలగుపడునప్పుడు-ఈలగాని ఇతరసంజ్ఞలగానిచేతురు. అప్పుడాప్రదేశమందున్న వీరివారందరు

గుమిగూడుదురు. ఒంటరిగనున్న స్త్రీలను బలాత్కారముగ నెత్తుకొనిపోయి, నగనాణ్యము లపహరించి, వారిని చెరిచి, ఒకప్పుడు వారిని నూతులలోగూడ పడవైచి చంపుదురు. నేరములు చేయబోవు నపుడు నగలేమియు బెట్టుకొనరు. నేరములు చేయునపుడు మాట్లాడరు.

వీరు ఉత్సవములలో స్వల్పచోరీలు చేయునప్పుడు రైలు సంచుల త్రాళ్ళు కోయుటకును, నగలదారముల త్రెంపుటకును ఉపయోగపడు ఒక చిన్న కత్తిని తమనోటిలో దాచుకొందురు.

వడిసెలలు, లాఠీలు, కత్తులు, గండ్రగొడ్డళ్లు, గునుపములు, వీరి పనిముట్లు. కన్నపుచోరీ చేయునపుడొక తాళపుచెవుల గుత్తినిగూడ తీసికొనిపోదురు.

దొంగసొత్తు తగినవెల వచ్చువరకు ఎంతమాత్రము తొందరపడి అమ్మరు. దానిని వీరుండు స్థలసమీపముల పాతి పెట్టుదురు. బంగారపు నగలు కరిగించుటకు ఇతరులను తెచ్చుకొందురు. నేరము చేసినవారికి కొంత సొమ్మునిచ్చి శేషించిన దానిని వంతులవగసను వీరు పంచుకొందురు. సమానముగు వాటాలువేసి పంచుకొనునప్పుడు వీరు బెడ్డముక్కల నుపయోగింతురు. కల్లు, సారాయిఅంగడివారుమాత్రమే కాకుండ ఇంకను పలుకుబడిగల కాపులు, రైతులు, గూడ వీరికి సహాయులే.

వీరు వేంకటేశ్వరస్వామి పండుగ చేయుదురు.

---



పచ్చెపవాండ్రు.

## ౩. పచ్చెపవాండ్రు.

వీరు మామూలుగ గ్రామముల బయటనుండు పుల్లలోను, తోటలలోను ఆగుదురు. పాతసత్రములలోను, పాడుదేవాలయములలోనుగూడ కొన్నిసమయముల నుందురు.

వీరు ఈరాజధానిలో చిత్తూరు జిల్లాలోని చంద్రగిరి మొదలు ఒరిస్సావరకును, కర్నూలు జిల్లాయొక్క ఈశాన్య భాగమునుండి నిజాముంరాజ్యములోని హైదరాబాద్, భువనగిరి, ఓరంగల్ జిల్లాలవరకును నేరములు చేయుటకు చుట్టివచ్చు ప్రదేశము.

వీరు కల్లుసారాయి అంగడివారితో కలిసిమెలసియుందురు. వీరందరు విశేషముగ త్రాగుదురు. వీరు మొండివారగుటచే వీరి చిన్నపిల్లలయొద్దనుండియైనను ఎట్టిసమాచారములనైన తెలిసికొనుట అతికష్టము. స్త్రీలు తమ కులస్థులతో మాత్రము వ్యభిచరింతురు. తాము బలిజీలమనియు, తెలగాల మనియు, గొల్లలమనియు వీరు చెప్పుకొనుటగలదు.

వీరు తెలుగుమాట్లాడుదురు. అరవము, హిందుస్తాని, ఓఢ్రభాషయు, గూడ వీరికి తెలియును.

వీరు యాచించి జీవింతురు. కొన్నివేళల పూసలు, పసుపు, కుంకుమ మొదలగునవి అమ్మునట్లుగూడ నటింతురు.

వీరు కన్నపుచోరీ, దోపిడి, బందిపోటు, నేర... చేయుదురు. ఆడవాండ్రు, పిల్లలు, స్వల్పచోరీలు ఎ...చి, జేయుదురు. గ్రామములలో తిరుగునప్పుడు కోళ్ళను ... దొంగిలింతురు.

వీరి యాడవాండ్రు గ్రామములోనికి బిచ్చమెత్తుకొనుట్క పచ్చాపికు పొడుచుటకు, సూదులు, పూసలు, అమ్ముకొనుటకు పోవునట్లు పైకి నటించినను, నేరముచేయవీలగు స్థలములు చూచి వచ్చుటయే వీరి ముఖ్యోద్దేశము. లాభకరమగు సమాచారములు కల్లుఅమ్మువారు చెప్పుదురు. సంతలలోను, ఉత్సవములలోను, స్వల్పచోరీలు చేయునపుడు రైలుసంచుల కుట్లను, నగల దారములను త్రెంపుటకొక చిన్నకత్తిని తమ నోటిలో దాచుకొనిపోవుదురు. ఆడవారు, పిల్లలు దొంగిలించి తెచ్చియిచ్చు సొత్తును వెంటనే భద్రపరచుటలో సహాయు లగుటకు బైరాగులవలెను, జంగములవలెను, హరిదాసుల వలెను వీరి పురుషులు దొంగవేషములు వేసికొని వారితో పోయి కొంతదూరమందు ఉందురు. ఆటంకము కల్గినప్పుడు దౌర్జన్యము చేయుదురు. నేరములు చేయునప్పుడు మాట్లాడరు. సాధారణముగ నేరములుచేయుటకు ఇతరులతో చేరరు.

వీరు లాఠీలు, గునపములు, ఎక్కువగనుపయోగింతురు. ఒకానొకప్పుడు మనుష్యులు భయపడుటకు రాళ్లుగూడ రువ్వుదురు.

వీరు చిన్నచిన్న నగలు నోటిలోను, మర్మప్రదేశముల

యందును దాచుటయేగాక బట్టచాటున తమ తొడలపై గుడ్డతో కట్టుకొందురు. బంగారపునగలు కరుగుటకు నితరుల కియ్యక తామేకరగించుకొందురు. దాచదగిన కొన్ని చిన్న నగలు తప్ప ఇతర దొంగసొత్తు తాము దిగియుండుచోటునకు కొంతదూరములో వీరి యాడవాండ్రు దాయుదురు. కల్లు సారాయి దుకాణదార్లు వీరివద్ద దొంగసొత్తు కొందురు.

వీరు ఉత్తరసర్కారులలో జరుగు ఉత్సవము లన్నిటికిని పోవుదురు.

---

## 4. దొంగవడ్డర్లు.

---

వీరు దాదాపు అయిదులక్షల వరకు లెక్కకువచ్చు ఒకపెద్దతెగవారుగాని అందరును నేరములు చేయువారుకారు. వీరి వృత్తిధర్మములబట్టి వీరు రెండు తరగతులుగ నున్నారు. వీరి రాజధానిలో పెక్కుస్థలముల నున్నారు.

(1) కల్లు వడ్డర్లు (రాతిపని చేయువారు)

(2) మన్ను వడ్డర్లు (మంటిపని చేయువారు)

వీరిలో కొందరు కర్నూలు, గుంటూరుజిల్లాలలో విశేషముగ నేరములు చేయుచు దొంగవృత్తి నవలంబించుటచేత మంటిపని, రాతిపని జేసికొని గౌరవముగ జీవించు ఇతర వడ్డర్లకును వీరికిని అమితమగు భేదము గలదు.

ఇప్పుడు నిగహాలోనున్న దొంగవడ్డర్లను కర్నూలు, కడప, చిత్తూరు, అనంతపురము, నెల్లూరు, గుంటూరు జిల్లాలలోని జనులు, బంగెనపల్లి రాజ్యములోని జనులు, సామాన్యముగ టక్కువడ్డర్లనికూడ పిలుచుచు ఇతర వడ్డెవాండ్రతో జేర్చక వీరిని ఒక ప్రత్యేకమగు తెగగ జూతురు.

వీరికి స్థిరమగు వాసస్థలములేనందున వీరి యునికిపట్టును గూర్చి అంతగా తెలియదు. వీరొకప్పుడు కర్నూలు జిల్లాలోని బొడ్డుచేలనుండి దాదాపు ఇరువది అయిదు సంవత్సరముల క్రిందట వినుకొండ తాలూకాలోని కొత్తలూరు వెళ్ళి యుండిరి. అచ్చట కొంత భూమి సంపాదించుకొని కాపుర మున్నారు. వీరి చుట్టుగుడిసెలు ఎత్తులేక చిన్న ద్వారములు కలిగియుండును. వీరు చూచుటకు లక్షణముగ నుందురు. అన్నిజంతువుల మాంసము తిందురు. విశేషముగ సారాయి త్రాగ నలవాటుగలవారు. వీరి ఆడవారు వ్యభిచారులు.

వీరు గుంటూరు, కృష్ణా, నెల్లూరు, కర్నూలు, అనంతపురము, కడప, చిత్తూరు జిల్లాలలోను, బంగెనపల్లి రాజ్యములోను నేరములు చేయుదురు. వీరు జనసమ్మర్దములేక అడవులు గల పర్వత ప్రాంతములనుండు గ్రామములలో నేరములు చేయుదురు. అట్టి ప్రదేశముల వీరిపై చర్యతీసికొనుట కష్ట సాధ్యము. వీరట్టి గ్రామములలో నేరములుచేయ నుద్దేశించ నపుడు ఆసమీపములనుండు తోపులలోను, సత్రములలోను, దేవాలయములలోను, పాడిండ్లలోను, దిగుదురుగాని నేరముచేయ నిశ్చయించుకొన్నప్పుడు అట్టిగ్రామములకు దూరములో నీటి

సదుపాయముగలమరుగుస్థలములయందు చీకటిపడువరకునుండి రాత్రి పరుండువేళకు బయలుదేరి అతివేగముగ నేరములు చేయదలచిన గ్రామములకు పోవుదురు.

వీరు సంకరమైన తెలుగుభాషను మాట్లాడుదురు.

వీరికి బిచ్చమెత్తుకొనుటతప్ప ఇతర జీవనాధారమేమియు నున్నట్లు కనబడదు. ప్రజలను నిర్బంధపరచి బిచ్చము వేయించుకొందురు.

వీరు నేరములు చేయుటకు పోవునప్పుడుగాని తిరిగి వచ్చునప్పుడుగాని రయిలుపైన,రోడ్లపైన,ప్రయాణము చేయుదురు. పెద్దరయితులవలెను, బాటసారులవలెను నటింతురు. మంచి దుస్తులు ధరించుదురు. సామాన్యముగ దూరప్రయాణములు చేయునపుడును, తిరిగి అచ్చటనుండి వచ్చునప్పుడును, మాత్రమే రైలుప్రయాణము చేయుదురు. అప్పుడు వీరు పోవలసినతావునకు కొంచెమివతలనే దిగుటకుజాగ్రతపడుదురు.

వీరు ఆ స్త్రీతోసంబంధించు ప్రతినేరము జేయుదురు. కొన్ని సమయముల ఇత్తడి నగలను కూడ అమ్మి మోసము చేయుదురు. బందిపోటు నేరములు చేయునపుడు తమపాల్పడిన వారిని పొత్తుచూపుడని దౌర్జన్యముచేసి బాధింతురు. మరియు ఆచుట్టుప్రక్కల రాళ్లు రువ్వుదురు. వీరు మరుగుస్థలములలో కొన్నిరోజులు ఆగవలసివచ్చినప్పుడు ఆసమీపముల తిరుగు గొర్రెలను, మేకలను దొంగిలింతురు. వీరి ఆడవారు తమవలె

నేరములు జేయుటయేగాక కోళ్ళ చోరీలు మొదలగు స్వల్ప చోరీలు చేయుటలో ఎక్కువ తెలివైనవారు. పిల్లలు కూడ స్వల్ప చోరీలు చేయుటలో గట్టివారు. పురుషులు చిరకాలమునుండి ఎక్కువ పేరుపడిన కన్నగాళ్ళును, దోపిడి దొంగలును. వీరి సాహసమును, దౌర్జన్యమును చూచి గ్రామస్థులు నేరములు చేయు ఇతరజాతివారికంటె వీరికి ఎక్కువగ భయపడుదురు.

వీరు గ్రామములలోనున్నప్పుడు దొంగనెపములు చెప్పి సమాచారములు తెలిసికొందురు. ఆడవారు యిండ్లయొక్క గుట్టుమట్లు కనిపెట్టి నేరములు చేయ నుపయోగించు సమాచారములు తెలిసికొనివచ్చి తమ మగవారికి చెప్పుటలో బుద్ధిశాలులు. ఆ గ్రామములలోనుండు చెడునడతగలవారు, రిసీవర్లు గూడ వీరికి పనికివచ్చు సమాచారముల నిత్తురు. ఇంతియ కాక ఆగ్రామములలో నుండు చెడునడతగలవారు తమకు సమాచారములు తెలిసినప్పుడెల్లను వీరుండుతావులకు వచ్చి ఆ సమాచారములు చెప్పి వీరి సహాయము బడయుదురు.

వీరు దూరదేశము వెళ్లునప్పుడు చీకటిపడువరకు రహస్య ప్రదేశములలోనుండి తమతో కూడ నేరములు చేయువారికై పంపి అందరుకలిసి బాగుగ త్రాగి, భోజనములుచేసి నేరము చేయ చూచిపెట్టుకున్న యింటికి పోదురు. తలుపులు తెరచుటకు గడియలవద్ద కన్నములు త్రవ్వుదురు. ఒకమనిషి లోనికి వెళ్లుటకు సరిపోవునంత కన్నమును గోడకు త్రవ్వుదురు. కిటికీల ఇనుపకమ్ములు ఊడ బెరికిగూడ వీరు లోపల ప్రవేశింతురు. వీరు నేర్పరులగు కన్నపుదొంగలగుటచే వీరు త్రవ్వు కన్నముల

యంచులు సన్నముగను, సూటిగను ఉండును. వీరొకచోట కన్నపుచోరీ చేయగల్గినప్పుడు ఆచుట్టుప్రక్కల నుపచరించని ప్రయత్నము లనేకములు వీరు చేసియున్నట్లు మనకగపడును. వీరు దొంగిలించిన ఆస్తి ఊరిబైటకు తీసికొనిపోయి అచ్చట వీరికొరకు కాచియుండెడు ఆయూరి నేరస్థుల కియ్య వారది తా మదివర కేర్పరచుకొన్న స్థలమునకు తీసికొని పోదురు. అవసరముగల్గినప్పుడు దొమ్మరవాండ్రు,మాలమాదిగవాండ్రు, ఎరుకలవాండ్రు మొదలగు తక్కువ జాతివారితో కలిసి నేరములు చేయుట కెంతమాత్రము సందేహించరు గాని నేరముచేసిన పిమ్మట వారితో కలిసియుండరు.

వడ్డర్లు తాము చేసిన నేరములు ఒప్పుకొనరు. తమ జాతివారిపై నేరములు మోపరు. మగవారు నేరములలో చిక్కుకొనియున్నప్పుడు ఆడవారు విశేష శ్రమనిచ్చుచుకొన్ని సమయముల వారిని అధికారుల స్వాధీనమునుండి విడిపించుకొని తీసికొనిపోవుటయుగూడ గలదు. మగవారు నేరములు చేసి దూరదేశములకు పారిపోయి, అచ్చట కొంతకాలముండి దొంగసొత్తు అమ్మెదరు. అప్పుడు వారి ఉనికిపట్టు తెలిసికొనుట మిగుల కష్టము.

వడిసెలలు. లాఠీలు, కన్నపుకర్రలు, గండ్రగొడ్డళ్ళు, వీరి ముఖ్యమగు పనిముట్లు.

వీరు సాధారణముగ దొంగసొత్తు రూపు మార్చకుండ తమ రిసీవర్లకు ఇత్తురు. కరిగించవలసిన యెడల నమ్మకము

గల కంసాలిచేత కరిగించుకొందురు. ఎచ్చటనైనను దిగియుండ
నప్పుడు దొంగసొత్తు మామూలుగ తమ గుడిసెల సమీప
మున పాతిపెట్టుదురు కాని సాధారణముగ తమ యిండ్లలో
నుంచుకొనరు. వీరు దూరమందుండురహస్యస్థలముల దానిని
పంచుకొని తక్కువ వెలకు అమ్ముకొందురు.

విధవలు తిరిగి పెండ్లి చేసికొనుటయు, మారుమనువుల
చేసికొనుటయు నంగీకరింతురు. బాల్యవివాహములు అంగీక
రింతురుగాని తరుచు చేయుటలేదు.

హిందువులకు ముఖ్యమగుపండుగలన్నియు చేయుదురు
వెంకటేశ్వరస్వామి యెడల వీరికి అమిత భక్తి యుండుటచే
ఎక్కడ వున్నను ఆదేవుని గొలుతురు. తిరుపతి స్వామికిని
గుంటూరు ముల్లా మస్తానునకును ముడుపులుగట్టుదురు. వీరి
నాయకునిపేరు గంగరాజు. ఇతడు కులవివాదములు మొదలగు
వాటిని పరిష్కరించును.

---

# 5. నక్కలవాండ్రు.

---

ఏనాదులు ఈ రాజధానిలో బళ్లారి జిల్లాలో తప్ప
మిగత తెలుగు జిల్లాలలో నివసించు తెగవారు. వీర
ముఖ్యముగ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు
జిల్లాలలోను, ఉత్తరార్కాడు, చిత్తూరు, కడప జిల్లాలలో



నక్కలవాండ్రు.

కొన్ని ప్రాంతములయందును, విశాఖపట్నం జిల్లాలోని కొండ ప్రదేశములుగల తాలూకాలలోను, గంజాం జిల్లాలో దక్షిణ భాగమందును గలరు.

వీరు 1. రెడ్డియానాదులు, 2. చల్లయానాదులు, 3. అడవియానాదులు, 4. నక్కలవాండ్రు, 5. కప్పలవాండ్రు, 6. చెంచువాండ్రు అని ఆరు తరగతులవారు.

1. రెడ్డియానాదులు :— పంటరెడ్లు వీరిని తమవద్ద ముఖ్యముగ వంటవారుగ నుంచుకొనుటచేత వీరు నిలకడగ వారివద్దనేయున్నారు. చల్ల, అడవి యానాదులను వీరు కుల భ్రష్టులుగ జూచుటచే వాటితో ఏవిధమగు సంపర్కము వీరికి లేదు.

2. చల్లయానాదులు:—వీరు గ్రామములబైట గుడిసెలలో నివసించుచు అడవిపంటవల్లను, వేటవల్లను, గ్రామస్థులకు చిల్లరపనులు చేయుటవల్లను స్థిరములేని జీవనోపాధులచే కాలము గడుపుకొనుచున్నారు.

3. అడవియానాదులు:—వీరు తలదాచుకొనుటకైన యిండ్లులేక అడవులలో తిరుగుచుండుటచే వీరిని అడవియానాదులనియందురు. వీరికి నెల్లూరు జిల్లాలో కన్నపుచోరీలు చేయుటయే వృత్తి.

4. నక్కలవాండ్రు:—వీరు గంజాం జిల్లాలో దక్షిణ

భాగమందును, గోదావరి జిల్లాలో పెద్దాపురం, రామచంద్ర పురం, ఆలమూరు, రాజోలు తాలూకాలలోను, విశాఖ పట్నం జిల్లాలో పాలకొండ తాలూకాలోను అనేకగుంపులుగ చెదిరియున్నారు. వీరు నక్కలను వేటాడితినుటచే వీరికి నక్కల వాండ్రని పేరువచ్చినది. వీరు తూర్పుయానాదులమని చెప్పు కొందురుగాని దక్షిణమునందుండు వీరికూటస్థులు తమతెగ వారుగ వీరిని చెప్పుకొనరు.

5. కప్పలవాండ్రు:—వీరు ఎక్కడకువెళ్ళక నెల్లూరు జిల్లాలోనేయున్నారు. వీరు కప్పలనుతినుటచేత వీరినీపేర బిలచెదరు.

6. చెంచువాండ్రు :—వీరు ఉత్తరార్కాటుజిల్లాలో నివసించియుండి చెంచుదేవతను పూజించుటచే వీరికీపేరు వచ్చి నది. వీరు కప్పలను తినరు. కప్పలవాండ్రు తమకుండలు ముట్టుటసయితము వీరంగీకరించరు.

వీరు చామనచల్పుగనుండు పొట్టివారు. వీరు నల్లనికండ్లు, నిడుపుగలముఖములు, సొట్టముక్కులు, వెడల్పులేనిఎదురొ మ్ములు, ఎత్తైనదవడయముకలుగలవారు. వీరికి ముఖముపైని శరీరముపైని విశేషముగ రోమములుండవు. తలవెంట్రుకలు ఉంగరములు చుట్టుకొనియుండును. పొత్తికడుపుపైని కొద్ది వెంట్రుకలుండును. ముక్కులకు కుట్లుండును. వీరు సామాన్య ముగ మొలకొకగుడ్డ చుట్టుకొనుట అరుదుగాని గోచిమాత్ర ము పెట్టుకొందురు. వారమునకొకసారియైన స్నానము

చేయకపోవుటచే వీరిదేహములు అతిదుర్వాసనగనుండును. తరుచుగస్త్రీలు శమశరీరముకప్పుకొనుటకు అవసరమగు గుడ్డ పీలికలు చేర్చి కుట్టుకొని కట్టుకొందురు. చేతులకు గాజులు, చెవులకుయిత్తడికమ్మలు, ముక్కునకుబులాకీ, మరియు నితర చిన్నవస్తువులు యిప్పటికాలమునకు తగినట్లుపెట్టుకొందురు. ఇతర దేశద్రిమ్మర్లు కట్టుకొనులాగుననే ఒకచోటనే కాపుర ముండువారి గుడిసెలుగూడ నుండును. ఒకతట్టునుండి లోపలికి పోవీలగులాగున రెండడుగుల చతురముగలదారి విడిచి, వెదుళ్లు వంచి వాటిపై గడ్డిగాని జొన్నదంటుగాని వేసి తమగుడిసెలు కట్టుకొందురుగాని అవి అంతగబాగుండవు. ఎద్దుమాంసము తప్ప యితర మాంసములు తిందురు. పచ్చి మాంసము ఎండ బెట్టుకొనిగాని వెచ్చబెట్టుకొనిగాని తిందురు. వీరు సారాయి విశేషముగ త్రాగుదురు.

తెలుగు గ్రామ్యపదముల యాసగనొక్కి మాట్లాడు దురు. వీరు మాటలను తొందరగనుచ్చరించుటయేగాక దీర్ఘా చ్చులను కురుచుగగూడ నుచ్చరింతురు. అరవదేశములో నివసించువారు తెలుగుకలిసిన అరవము మాట్లాడుదురు.

వీరు వేళ్ళయొక్కయు, ఓషధులయొక్కయు వైద్య సాధనములెక్కువగ తెలిసినవారగుటచే కొన్ని రోగములు చికిత్సచేయుటలో గట్టివారు.

వీరు సాహసమగు నేరములు చేయదలచినప్పుడు ఎరుకలవాండ్రతోను, పచ్చెపవాండ్రతోను జేరుదురు.

తరుచుగ వారివలె మారువేషములు వేసి వారిపై యనుమానము పుట్టింతురు.

ఉత్తర సర్కారులలో చల్లయానాదులు, అడవియానాదులు నేరములుచేయువారిలో మొదటివారుగ నెన్నదగినవారు.

వీరు బందిపోటు, రాజమార్గములపైని దోపిడి, నేరములను చేయుచు అప్పుడప్పుడు దౌర్జన్యము కూడ చేయుదురు. నిలకడగనుండు యానాదులు గొర్రెల లేక మేకల చోరీలు కడుసాహసముగ చేయుటలో నిపుణులు. వీరు సర్వసామాన్యముగ అమావాస్య మొదలు నాలుగు రోజుల వరకు నేరములు చేయుదురు.

'సికారులుకోలు' అను ఒక ఇనుపపనిముట్టు వేళ్ళు మొదలగునవి త్రవ్వుకొనుటకు ఉంచుకొన్నట్టు వీరు పైకి సాకు చెప్పుదురు గాని అది నిజముగా వీరి కన్నపుకోల. అది రెండు వైపుల మొనగల్గి ఒక వైపు కర్రపిడి వేయబడిన సామాన్యపు యినుపపనిముట్టు. చప్పుడుగాకుండ, వేగముగ దానితో గోడలకు కన్నములు త్రవ్వగలరు. బాగుగ దోచుకొనువరకు ఒకరాత్రి చాలయిండ్లకు కన్నములు త్రవ్వుదురు.

వీరు దొంగసొత్తు అమ్ముటకు స్త్రీల నియమింతురు. సంజచీకటివేళ వీరు తాముఅల్లిన చాపలనమ్ముటకును, బిచ్చమెత్తుటకును గ్రామముల వెంట బోవుచు, చౌకగ వస్తువులు

అమ్ముదుమని ఆగ్రామమందుండు అడవారిచెవిని వేతురు. వారు తరుచుగ వీరివస్తువులకాసించి కొందురు. దొంగసొత్తు బుట్టలలో పట్టుకొనిపోయి కోమట్లకు విక్రయింతురు. అడవి యానాదులు, తమ స్త్రీలను బిచ్చమెత్తునపుడు సమాచార ములు కనుక్కొని రమ్మని పంపుదురుగాని సారాయి అంగడి వారిచ్చు సమాచారములు తమకుపకరించునని వీరు ముఖ్య ముగ వారిచ్చువాటినే నమ్ముదురు. నిలకడగల యానాదులు తమస్త్రీలకీ పని పెట్టరు. అడవియానాదులు కల్లు సారాయి అంగడివారితో అతిస్నేహముగనుందురు.

వీరు తాముచేసిన నేరములగురించి వెంటనే ఎకరరు పడుదురుగాని తమతో జేరి నేరములుచేసినవారి నెంతమాత్రము బయలుపర్చరు.

వీరిలో విధవలు వివాహమాడవచ్చును. ఆడవారు పెక్కువివాహములాడవచ్చును. మగవారుభార్యలను సులభ ముగ విడిచిపెట్టవచ్చును. వీరు పిల్లలకు బ్రతికియున్న బంధు వులపేర్లు పెట్టక తమకులవేల్పుపేరు పెట్టుదురు. అందులో ముఖ్యముగ కవిటి, కమలమ్మ, నాగమంజ పేర్లలోనేదైన నొకటి పెట్టుదురు. వీరికెక్కడను కులగురువులు లేరుగాని తమ పెద్దలలోనొకని కులనాయకునిగ జూతురు. వీరు మూఢులగుటచే అంకమ్మ, పోలేరమ్మ మొదలగు దేవతలను మాత్రము పూజింతురు.

---

## II ప్రకరణము.

---

### 1. దొంగ ఎరుకలవాండ్రు.

---

ఎరుకలవాండ్రు కొరవజాతికి చెందు తెలుగు తెగవారు. వీరనేక భాగములుగ చెదిరియున్నారు. వీరు పెక్కుభాషల మాట్లాడుచు, వేరువేరు ఆచారములు గలిగి కొందరు నేరములు చేయువారుగను, మరికొందరు నేరములు చేయనివారుగను, ఉన్నారు. ఇప్పుడు నిగహాలోనున్న దొంగ ఎరుకలవాండ్రు దేశద్రిమ్మరులనియు, గజదొంగలనియు గోదావరి, గుంటూరు, నెల్లూరు, కర్నూలు జిల్లాలలో పేరుగలదు. నేరములుచేయు ఇతరజాతులవారితో వీరి కెంతమాత్రము సంబంధము లేదు. (1) గోదావరి జిల్లాలోను, (2) గుంటూరు జిల్లాలోను, (3) నెల్లూరు, కర్నూలు జిల్లాలలోను నేరములుచేయు దొంగ ఎరుకలవాండ్ర వృత్తాంతములు వేరువేరుగ ఈక్రింద ఇవ్వబడినవి.

---

### (I) దొంగ ఎరుకలవాండ్రు

---

వీరిని వడ్డె ఎరుకలవాండ్రని కూడ బిలుతురు.



దొంగ ఎరుకల వాండ్రు.

వీరు గ్రామములదగ్గరనుండు తోపులలోను, పోలీసు స్టేషనుల ఎదుటనుండు బయిళ్ళయందును దిగుదురు.

వీరు మకాముచేయు గ్రామములలోగాని, ఆ సమీపములగాని వీలు చిక్కినప్పుడెల్ల నేరములు చేయుచు, గోదావరి, కృష్ణా, విశాఖపట్నం జిల్లాలలో తిరుగుదురు.

వీరెప్పుడు కాలిమార్గములను, రోడ్లపైన పోవుదురు. కొద్ది జాతి వారితో చేరునట్లు వీరు కనపడరు. జయిలునుండి విడుదలై వచ్చు ఇతర జిల్లాల ఎరుకలవాండ్రను తమ గుంపులో జేర్చుకొందురు. ఈ క్రొత్త మనుష్యులు ఇతర గ్యాంగులను చెంది పరారీలుగ నుందురు. వీరిని అడిగినప్పుడు తాము ఆ గుంపునకు చేరిన ఎరుకలవాండ్రమని చెప్పుట కంటె తమ వృత్తాంతము నధికముగ తెలియనివ్వరు. దీని నిజము తెలిసికొనుటకు వీరి వ్రేలిముద్రలను తీసికొని 'ఫింగర్ ప్రింట్ బీరో'కు పంపిన వారిచ్చు సమాచారము కొన్ని సమయముల నుపయోగించును.

వీరు తెలుగు, ఎరుకలభాషయు మాట్లాడుదురు. ఈ ఎరుకలభాష సంకరమైన అరవముగా నుండును.

వీరు త్రాళ్ళుపేని, ఈతచాపలనుఅల్లి, కోతులనుఆడించి, బిచ్చమెత్తి, పల్లెటూరి ఆడవారికి పచ్చారు పొడిచియు జీవింతుమని చెప్పుదురు. వీరు పందుల, గాడిదెల వ్యాపారము కూడ చేయుదురు.

వీరు స్వల్ప చోరీలు చేయుదురు. గొప్ప నేరములు చేయగల పన్నాగములు పన్నలేరు. ఒకవేళ గొప్ప నేరము లేవైన చేసినను లేక చేయుటకు ప్రయత్నించినను పేరుబడ్డ ఇతర గుంపులోని ఎరుకలవాండ్రు వీరితో నున్నట్టు గ్రహించ వచ్చును.

వీరు తరుచుగ దొంగతనము చేయునప్పుడు దౌర్జన్యము చేయరు. నేరములు చేయుటకు వీరికి ప్రత్యేకమగు ఆయుధ ములుగాని పనిముట్లుగాని లేవు.

సాధారణముగ దొంగసొత్తు తాముండు స్థలసమీప ముల దాచి, అచ్చటనుండి వెళ్ళునప్పుడు దానిని వెంట తీసి కొని పోదురు. బంగారము మొదలగునవి కరగించలేరు. ఆ నగల రూపుమాపకుండ వాటిని రిసీవర్లకు అమ్మెదురు.

వీరు కల్లు త్రాగుదురు. ఒకని స్వాధీనములోలేని ఆడది ఎన్నిమారులైన పెండ్లి చేసుకొను వాడుక వీరి కులమందు న్నను, స్త్రీలు వ్యభిచారులుగ కనబడరు.

వీరు కలరా మొదలగు అంటురోగములు దేశములో ప్రబలి యుండునప్పుడు పోలేరమ్మ, మారెమ్మ, పోతరాజులకు ఉత్సవములు చేయుదురుకాని ఈ దేవతలకు ఎక్కడను గుళ్ళు గాని విగ్రహములుగాని లేవు. తుని గ్రామములోగాని నక్క పల్లి గ్రామములోగాని ఈ పండుగలు చేయుట వీరికిష్టము.

# (2) దొంగ ఎరుకలవాండ్రు

వీరు సాధారణముగ అడవులలోను, గ్రామముల బయిటను, తమ పశువులకు నీరు, మేత దొరకు చెరువు లేక నది సమీపములనుండు మరుగు ప్రదేశముల నివసింతురు. వీరెన్నడును సత్రములలో దిగరు. సాధారణముగ వర్షాకాలములో వీరు యిచ్చు సొమ్ము నపేక్షించి వీరితో వ్యభిచరించువారి యిండ్లలో నుందురు.

వీరు గుంటూరు, నెల్లూరు, కర్నూలు జిల్లాలలోను నైజాం రాజ్యములోను నేరములు చేయుటకు తిరుగుచుందురు.

వీరు రైలు ప్రయాణము లెప్పుడు చేయరు. వీరు త్రాగని రోజు లేదు. ఎక్కువగ పందిమాంసము తిందురు. వీరి ఆడవారు వ్యభిచరించుటలో ఎక్కువగ పేరుపడినవారు కాకపోయినను జారత్వము లేకపోలేదు. తమ కులస్థులవద్ద తీసికొన్న ఋణములు తీర్చువరకు వీరు కొన్ని సమయముల తమ ఆడవారిని వారివద్ద నుంచుదురు. వీరు నేరములు చేయుటకు ఏనాదులు, మాలమాదిగలు మొదలగు వారితో జేరుదురు.

వీరు కర్వేపాకు అమ్మి, బిచ్చమెత్తి, ఉప్పు, ధాన్యము మొదలగువాటిని ఒకచోటనుండి మరియొకచోటికి మోసి, వ్యవసాయదారులకు తమ పశువులను అద్దెకుతోలి, పంట

కొంతకాలములో కూలిపనులు చేసియు జీవించునట్లు కన బడుదురు.

వీరు ప్రయాణస్థులవలె నటించుచు జనులతో కలిసి వారివద్దనుండి సమాచారములను పోగుచేయుదురు. గ్రామములలో కర్వేపాకు అమ్మి, బిచ్చమెత్తెడి తమ ఆడవారినుండియు, రిసీవర్లనుండియు, నేరములు చేయుటకు మాత్రము తమతో జేరు ఆయాగ్రామములలోనుండు ఎరుకలవాండ్రనుండియు, ఇతర నేరస్థులనుండియు, తమ పిల్లలనుండియు వీరు సమాచారములు తెలిసికొందురు.

వీరు రాజమార్గములపై బందిపోట్లు, దౌర్జన్యముతో కూడిన దోపిళ్ళు, ముందుగ నాలోచించుకొని చేయు కన్నపుచోరీలు, పశువులచోరీలు చేయుదురు. స్త్రీలను దోపిడిచేయ తటస్థించినపుడు వారిని తరుచుగ చెరుచుటయు గలదు.

భాగ్యవంతుల ఇల్లొకటి చూచుకొని కన్నపుచోరీ చేయ పన్నాగముల బన్నెదరు. సామాన్యముగ అట్టి ఇండ్లు వీరుండు స్థలములకు దూరముగ నుండును. అతిశీఘ్రముగ ఆ యిండ్లకుపోయి నేరములుచేసి తెల్లవారకమునుపే తమ మకాములు జేరుదురు. ఇద్దరు ముగ్గురు మాత్రమే నేరములు చేయుదురు. ఇతరులు వీరికేదయిన ప్రమాదము రానైయున్నప్పుడు సంజ్ఞలు చేయ వేచియుందురు. మామూలుగ ద్వారబంధమువద్ద నొక కన్నము త్రవ్వి తలుపు గడియ తీయు

దురు. వీరికి దొరుకు ఆస్తి అంతయు తీసికొనిపోదురు. ఒంటిపైనుండు విలువగల నగలు బలవంతముగ త్రెంపుకొందురు. ఆ సొత్తంతయు బైటనున్న తమవారికి ఒప్పగింతురు. దానిని వారు ముందుగ నేర్పర్చుకొన్న స్థలమునకు వెంటనే తీసికొని పోవుదురు. వీరిని వెంటనే పట్టుకొనక జాగుచేసిన యెడల దొంగసొత్తంతమాత్రము దొరకదు.

విశేషముగ కల్లు, సారాయి అమ్మకమగునప్పుడును, గొర్రెల, మేకల చోరీలు చుట్టుపట్ల జరుగునప్పుడును, వీరు ఆ సమీపముల నున్నారని బాగుగ తెలిసికొనవచ్చును.

వీరు గోడకు కన్నము త్రవ్వుటకై ఉక్కుతోగాని, ఇనుముతోగాని చేయబడిన కర్రలనుపయోగింతురు. కత్తులు, లాఠీలు, వడిసెలలు మొదలగునవి గూడ వీరికి పనిముట్లు. ఎరుకలవాండ్రు పిరికివాండ్రగుటచే తుపాకిదెబ్బ చప్పుడు వినే వినుటలో మైళ్ళకొలది దూరము పారిపోదురు.

వీరు దూరముగనుండు పొదలోగాని భూమిలోగాని దొంగసొత్తు జాగ్రత్తగ పాతిపెట్టి దానిపైని గొంతుకూర్చుందురు. సొమ్ముమాత్రము తమ గుడిసెలకు తీసికొని పోదురు. బంగారపు నగలు కరిగించక వాటిని రిసీవర్లకిచ్చి అందుకు వారిచ్చు సొమ్ము తెచ్చుకొని త్రాగుటకు, వ్యభిచరించుటకు పూర్తిగ వినియోగింతురు. వీరందరు దొంగసొత్తు తాము మాత్రమే పంచుకొనక జయిలులో నున్నవారి కుటుంబములకు కూడ సమానముగ పంచుదురు.

వీరు అంకమ్మ, మారెమ్మ, కొల్లాపురమ్మ, పోలేరమ్మ మొదలగు దేవతలను గొల్తురుగాని దేవాలయములు లేవు. వీరికి పశువులధికముగ నుండుటచే (పొంగల్) సంక్రాంతిపండుగ అతి వైభవముగ చేయుదురు. వీరు వెంకటేశ్వరస్వామిని గూడ పూజింతురు.

---

## (3) దొంగ ఎరుకలవాండ్రు

---

వీరు తమతో తీసికొని పోవీలగులాగు గుడిసెలు కట్టుకొని సామాన్యముగ గ్రామములకు బైటనుండు మైదానముల లోగాని, గ్రామములకు అడవులకు సమీపమందుండు చెర్వుల ప్రక్కనుగాని నివసింతురు.

వీరు దత్తమండలములోను, మైసూరు, హైదరాబాదు రాజ్యములలోను నేరములు చేయుదురు.

వీరు ఎక్కువ ధైర్యసాహసములు గలవారు. దూర ప్రయాణములు రైలుమీదను, దగ్గిర ప్రయాణములు కాలి నడకను చేయుదురు. ఎక్కువ గుట్టుగలవారగుటచే నిజమెన్నడు చెప్పరు. పిల్లలకు కూడ ఆ విద్యనే చిన్ననాటనుండియు నేర్పుదురు. స్త్రీపురుషులందరు త్రాగుదురు. వీరి స్త్రీలు వ్యభిచారులు.

వీరిలో చాలామంది తెలుగు, హిందుస్తాని, అరవము మాట్లాడుదురు.

వీరు బిచ్చమెత్తుకొని, కర్వేపాకు, త్రాళ్ళు అమ్ము కొనియు జీవించుదురు.

వీరు స్వల్పచోరీ మొదలు రాజమార్గములపై బంది పోటు వరకుగల నేరములన్నిటిని చేయుచు, తమ పాల్పడిన వారిని నిర్దయులై పలువిధముల బాధల పెట్టుదురు.

వీరిలో స్త్రీలు, బిడ్డలు, ముసలివారు, బిచ్చమెత్తుకొను టకును, కర్వేపాకు, త్రాళ్ళు అమ్ముటకును గ్రామములలో తిరుగుచున్నను, కన్నపుచోరీలు చేయతగిన ఇండ్లు, అందు విషయమగు సమాచారములు తెలిసికొనివచ్చి వీరికి తెలుపు టయే వారికి మొదటిపని.

వీరు నేరములు చేయునప్పుడు మారువేషములను వేతురు. తమ పాల్పడిన వారిని నిర్దయులై ఎదుర్కొని ఆస్తి దొంగిలించకముందే వారిని బాధపెట్టుదురు. కన్నపుచోరీలు చేయుటకు ఇంటిలో ప్రవేశించవీలగు చోటును తెలిసికొన ప్రయత్నింతురు. పిమ్మట ఎంతమాత్రము చప్పుడు చేయకుండ నేరము చేయుదురు. సాధారణముగ వీరు నేరముచేయునప్పుడు అరవములో ఇంటివారిని దూషింతురు. పేర్లతో పిలుచుకొ నరు. నేరములుచేయుటకు అప్పుడప్పుడు నేరములుచేయు ఇతరజాతివారితో జేరుదురు.

గునుపము కన్నపుచోరీచేయుటకు వీరికి ముఖ్యాయుధము. గండ్రగొడ్డళ్లు, చేతిగొడ్డళ్ళు, వంకరకత్తులు గూడ తమతో తీసికొని పోదురు. తాము ఎదుర్కొను నప్పుడుగాని తప్పించుకొను నప్పుడుగాని ఉపచరించు లావుపాటి వెదురు కర్రలగూడ నుంచుకొందురు.

వీరికి రిసీవర్లు ఎవరు లేనందున దొంగసొత్తు స్వల్ప వెలకు విక్రయింతురు. నగలు కరిగించలేరు. కొన్నిసమయముల నగలరూపుమాపి కాపుల భార్యలకు ఇత్తురు. తాము దిగియుండు స్థలసమీపముల దొంగసొత్తు పాతిపెట్టుదురు. వీరి గుంపును ముట్టడించునపుడుగాని వీరి గుడిసెలు సోదా చేయునపుడుగాని ఆడవారు తరుచుగ చిన్ననగలు తమనోటిలో దాచుకొందురు. మరికొన్ని సమయముల నేరములు పట్టుబడకుండుటకై ఆడవారును, మగవారునుగూడ వాటిని మ్రింగివేయుదురు. ఈగుంపువారు ప్రయాణము చేయునప్పుడు దొంగసొత్తు దాచుటకు వీరికి అవకాశము చిక్కదు గనుక అట్టి సమయముల వీరిని తప్పక సోదా చేయవలయును.

వీరి వివాదలన్నియు పంచాయితీలపై పరిష్కరించుకొందురు. 'పొంగల్' మొదలగు పండుగులనన్నిటిని వీరు చేసికొందురు. పోలేరమ్మను, వేదగిరి నరిసింహాను, తిరుపతి వెంకటేశ్వరస్వామివారిని మ్రొక్కుకొని వారిని దర్శించుటకు వెళ్లుచుందురు.

---

# 2. కొరచవాండ్రు

వీరు పెద్దదగు కొరవ జాతిలోనొక తెగవారు. వీరు దక్షిణ దేశములోనున్న కొరవవారికిని ఉత్తరాదినియున్న ఎరుకలవాండ్రకును, చెందు తెగవారు. వీరు దత్తమండలములో విశేషముగ నున్నారు. అచ్చట వీరిని కొరచవాండ్రందురు. (1) చిత్తూరు జిల్లాలోనున్న కొరచవాండ్రను నవాబుపేట కొరచలనియు, (2) బెళ్లారి జిల్లాలోనున్న కొరచవాండ్రను రుద్రపాద కొరచలనియు బిలుతురు. ఈ రెండు తెగలవారు కడుసాహసమగు గజదొంగలు. వీరి వృత్తాంతము ఈ క్రింద యివ్వబడును.

## (I) నవాబుపేట కొరచవాండ్రు

వీరు మొదట నెల్లూరునుండి చిత్తూరు, ఉత్తరార్కాడు జిల్లాలగుండ అనంతపురము పోవు వర్తకులుగ కనిపెట్టబడిరి. వీరుపోవుస్థలములలో జరుగుసంతలలో దొరకు ధాన్యమునకు అపరదినుసులకు బదులుగ తమతో వర్తకమునకై తీసికొని పోవు ఉప్పు, నువ్వులు, ఆముదాలు మొదలగునవి విక్రయించుచు వచ్చిరి.

వీరు పట్టణములబయిట నివసించుచు నేరములు చేయ దలచినప్పుడు మాత్రము కొండలలోనికిగాని అడవులలోనికి గాని పోవుచుందురు.

వీరియొక్క నిలకడతావు చిత్తూరు జిల్లాలోని వాయలపాడు తాలూకా. ఉత్తరమున భద్రాచలము మొదలుకొని దక్షిణమున గుడియాతం, తిరుపత్తూరు వరకునుండు ప్రదేశములలో వీరు నేరములు జేయుదురు. ముఖ్యముగ వీరు కడప, అనంతపురము, నెల్లూరు, చిత్తూరు, ఉత్తరార్కాడు, చెంగల్పట్టు జిల్లాలలోను, ఈ జిల్లాలకు సమీపముననుండు మైసూరు రాజ్యమునకు చెందు తాలూకాలలోను నేరములు చేయుదురు. వీరిలో పురుషులు దోపిడి నేరములు చేయుటకు రయిలుపైని, రోడ్డుపైని గుంపులుగ పోదురు. సాధారణముగ వీరు అడవులగుండను, కాలినడకలను, గుట్టలపైని గూడ పోదురు.

స్త్రీ పురుషులందరు కల్లు, సారాయి విశేషముగ త్రాగుదురు. ఆడవారు వ్యభిచరింతురు.

వీరు ఇండ్లలోను, రోడ్డుపైని బందిపోట్లు, దోపిళ్ళు, కన్నపుచోరీలు, ఛావు (యిత్తడి నగలు బంగారపు నగలుగ దగాచేసి అమ్మడము) మొదలగు నేరములు చెయుటయేకాకుండ గొర్రెలు, మేకలు, పందులు, కోళ్ళు మొదలగు వానిని కూడ దొంగిలింతురు. ఒక గ్రామములో నెక్కువగ కోళ్ళచోరీలు జరుగుచుండిన వీరచ్చట నున్నట్టు స్పష్టమగును. విశే

షముగ కల్లు అమ్మకమగుటయు ఆ చుట్టుప్రక్కల తాటిచెట్ల నుండి కల్లు దొంగిలించుటనుబట్టియు వీరాసమీపముల నున్నట్టు దెలిసికొనవచ్చును. బందిపోటు, దోపిడి, కన్నపుచోరీలు చేయునప్పుడు తరుచుగ దౌర్జన్యము చేయుదురు. పిల్లలు నేరములు చేయరు. నేరములుచేయు నితరజాతివారితో వీరు జేరునట్లు కనపడదు.

కర్వేపాకు అమ్ము మిషపైని గ్రామములలోనికి పోవు వీరి స్త్రీలనుండి సమాచారములు వీరు ముఖ్యముగ తెలిసికొందురు. నేరములు చేయకపూర్వమే ఇండ్లవివరము, చుట్టు ప్రక్కలనుండు గ్రామములదూరము, సమీపమందుండు అడవి, ఆయుధములు గలవారి సంఖ్యయు, జాగ్రత్తగ తెలిసికొందురు. వీరు మారువేషములు వేయరు

వీరు కన్నపుచోరీ ఎక్కువ తెలివితేటలతోను, హస్తలాఘవముతోను జేయుదురు. మామూలుగ గడియలవద్ద గోడకు కన్నము త్రవ్వుదురు. అప్పుడిద్దరు, క్రిందపడు రాళ్లు చప్పుడు కాకుండ యుండుటకు ఆ పనిముట్టునకు క్రిందుగ బట్ట పరిచి పట్టుకొందురు. కొన్ని సమయముల చూరుగుండగాని వీలగు నితరస్థలములనుండిగాని లోనికి ప్రవేశింతురు. వీరిలో తెలివితేటలు గలవారు ఆ గ్రామములోనుండు గొప్ప భాగ్యవంతుని యింట్లోప్రవేశింతురు. ఇతరులు బయిట నిలబడి వారినెవరును పట్టుకొనకుండ చూచుచుందురు. ఒక యింటిలోనికి పోవుటకు రెండుమూడు మార్గములున్నప్పుడు, ఇద్దరుముగ్గురు మనుష్యులు లోనికి పోయి అచ్చట చాలామంది పరుండియు

న్నను వారి మధ్యనుండి నడచుచు వారిని లేపకుండ మాట్లాడు కొందురు. విలువగు ఏ వస్తువును వదలిపెట్టకుండ దొంగిలించుటయే నబాబుపేట కొరచల గట్టిసామర్థ్యము. వీరు నేరము చేయు ఇంటిచుట్టుపట్ల కుక్కలున్నయెడల గంజాయిపొడి చల్లిన మాంసమును అవి మొరగకుండనుండుటకు వేతురు. అడవులలో చెదరిపోయిన వీరివారు నక్కకూతలు కూసియు గుడ్లగూబలవలె అఱచియు ఒకరినొకరు తిరిగి కలసికొందురు. వీరు పోయినమార్గము తమవారికి తెల్పుటకై మార్గములపై తంగేడు యాకులును, గుడ్డపీలికలను వేయుదురు. కొండమార్గముల పోవునప్పుడు రాళ్లుపేర్చి వీరు పోయినమార్గమును తమవారికి చూపుదురు.

పట్టపగలు రాజమార్గములపై బందిపోటు నేరము మామూలుగ జేయుదురు. నేరములు చేయుటకు పోకపూర్వమే మార్గస్థులను అడ్డగించుట కొరక ప్రదేశమును, ఆ సమీపమున తాముండుట కొరక యడవిని వీరు జూచుకొందురు. వీరిలో కొందరు మార్గస్థులవలె నటించుచు ప్రయాణస్థుల రాక కెదురు చూచుచుందురు. ఇతరులు ఆ సమీపమున దాగియుందురు. ఆ సమీపముననుండు ఎత్తగు ప్రదేశమందొకడు కూర్చొని బాటసారుల రాక తనవారికి పశువులకాపరి యరచినట్లరచి తెలియజేయును. ఈ కేక వినినవెంటనే బాటసారుల నడ్డగించుప్రయత్నముపై తనవారుందురు. ప్రయాణీకులు ఒకరిద్దరయినయెడల రోడ్డువద్దనున్నవారు వారిని జేరి కొంచెము పొగాకూ, సున్నము యిమ్మని అడుగుదురు. వీరిట్లు

వారితో మాట్లాడుచుండునపుడు వీరి గుంపువారు వెనుక పాటున వచ్చి వారివద్దనుండుసొత్తు కొట్టి దోచుకొందురు. వీరు సాధారణముగ దివిటీలను గూడ నుపయోగింతురు.

ఈ గుంపునకు చెందు ముసలివారు, కుంటివారు 'రాపు' నేరముచేయుచు సులభముగ సొమ్ము సంపాదించుచుందురు. ఈ గుంపువారు అమ్మతెచ్చు ప్రతివస్తువు బంగారపుదేయని జనులెప్పుడు నమ్ముటచే వీరికావెఱ్ఱినమ్మకము మిగుల లాభకారిగ నున్నది. వీరు ఇత్తడి నగలు తాము చుట్టివచ్చు సంతలలోను, ఉత్సవములలోను కొని వాటిని బ్రహ్మజెముడుపండ్ల రసముతోను, మరియొకవిధమగు ఆకుతోను, మెరుగువచ్చువరకు బాగుగతోమి, వాటిని బంగారపు నగలని చెప్పుచు స్వల్పధరలకమ్ముదురు. పలుకుబడి గలవారును గౌరవస్తులవలె కనపడువారును గూడ వెంటనే వీరివద్ద ఆ నగలను కొందురు.

వీరు తమ గ్రామములలో నుండక పైన దాగియుందురు. వీరు బయిటపోవునపుడు పశువులనుగాని ఇతర వస్తు సామాగ్రినిగాని తమతో తీసికొనిపోరు. బందిపోటునేరము చేసినపిమ్మట ఆ నేరముచేసిన చోటునకు దూరముందుండు అనుకూలమగు యడవిలో నిలుతురు. వీరికక్కడ అన్నము, ఇతరసామానులు తెచ్చియిత్తురు. రెండురోజులకు సరిపోవు తినుబండారములు మాత్రము నేరములు చేయుటకుపోవునపుడు వీరు తమతో పట్టుకొని పోదురు. వీరు కొంతకాలము ఆగవలసివచ్చినప్పుడు వీరువారు సమీప గ్రామములకు

పోయి తిండిసామాగ్రులు కొందురు. జయిలునుండి విడుదలైన తారీఖు మొదలు యిరువదిరోజులు గడచువరకు ఎవడును నేరము చేయపోకూడదు. మరియు తనతో తనకఱ్ఱను గాని ఆయుధమునుగాని తీసికొనిపోవ మరచినవాని నెల్లప్పుడు వెనుక విడిచిపెట్టుదురు.

కఱ్ఱలు, కత్తులు, దివిటీలు, రాళ్లు మొదలగునవి వీరి నేరపు పనిముట్లు.

వీరు నేరములలోని దొంగసొత్తు తమగుడిసెలకు తీసుకొనిపోరు. వీరు తమ రిసీవర్లకు దానిని అందచేయకమునుపు తమరుండు ప్రదేశములకు దూరమున లేక అడవులలోను సామాన్యముగ పాతిపెట్టుదురు. కొన్ని సమయముల నాలు గైదు అడుగుల లోతున దానిని భూమిలో పాతిపెట్టుదురు.

నేరములుచేయు తమవారందరికి దొంగసొత్తు పంచుదురు. దొంగిలించుటకు ఇంట్లో ప్రవేశించిన వారికెప్పుడు రెండువంతుల నిచ్చుటయే కాకుండ నూటికి పది రూపాయల వంతున బహుమానము కూడ నిత్తురు. ఎవ్వడైన ఒకప్పుడు రెండువంతులిమ్మని పోట్లాడిన పరుండియుండు ఆడవారిని లేపకుండ వారి మొలవడ్డాణముగాని ముక్కుపుడకగాని తీసి పట్టుకొనివచ్చిన అటులనే ఇత్తుమని వానికి బదులు చెప్పుదురు. కుంటివారికి, ముసలివారికి, జయిలులో నున్న వారి కుటుంబములకును సాధారణముగ వారికివ్వవలసిన వంతులో సగముమాత్రము నిత్తురు. వీరు దొంగసొత్తు పంచకమునుపే తమవా

రిపై వచ్చు కేసులలో వాదించుటకు నియమించుకొను వకీలు నకిచ్చుటకు కొంతసొమ్ము దానినుండి తీసి వేరుగనుంచుకొందురు. దొంగబట్టల కొద్దివెలకమ్ముదురు. కొన్ని సమయముల దూరమునందున్న తమబంధువులకు పంపుదురు. ఆ స్త్రీనెప్పుడును ఇండ్లకు చేరినపిమ్మట పంచుకొందురు.

వీరికి ప్రాపకులు రిసీవర్లుకూడ గలరు. వీరు దేశద్రిమ్మర్లగుటచేత తామిచ్చుదొంగసొత్తుభద్రపర్చుటకు వారు ముఖ్యావశ్యకులు. వీరిలో ఒకడొకడు తనవంతునకువచ్చిన దొంగసొత్తు లాభసాటిగ విక్రయించి పెట్టుటకు వారిచేతికిచ్చును. వీరిని దగా చేయదలచిన రిసీవర్లకుగాని ప్రాపకులకుగాని ఎక్కువబాధ కలుగును. ఇంకను దొంగసొత్తు నిచ్చెదమని అట్టివారి నొక రహస్య స్థలమునకు పిలుచుకొనిపోయి వారిని దోచెదరు. ఒకప్పుడు ఖూనీ చేయుటకు గూడ సాహసింతురు. వీరి రిసీవర్లు, ప్రాపకులు ఇతర స్థలముల నివసించక వీరెల్లప్పుడు నుండు తావులనే చాలావరకు నివసింతురు.

వీరు యుగాది, దీపావళి, సంక్రాంతి, మారెమ్మ పండుగలు సేయుదురు. కొల్లపురమ్మ, మారెమ్మ, గంగమ్మ, అంకాలమ్మ, తిరుపతివెంకటేశ్వరులు వీరిదైవములు.

---

# (2) రుద్రపాదం కొరచవాండ్రు

వీరు బళ్లారిజిల్లా సిరిగిరి పోలీసు స్టేషను సరిహద్దులలో నివసింతురు. వీరందరికి వీరి గ్రామములలో నిండ్లుగలవు. కొందరికి కొంత భూవసతికూడ గలదు.

బందిపోటు నేరములు చేయుటకు సమాచారము వచ్చినప్పుడు వీరు గుంపులుగ బోదురు. బొంబాయి రాజధానిలోని కైకాడీలకును వీరికిని బాంధవ్యములుండుటచే వీరు షోలాపూర్, ధార్వార్, బీజపూర్‌లోను, హైదరాబాద్ రాజ్యమందును నేరములు చేయుదురు. రుద్రపాదము చుట్టునుండు గ్రామములలో తాము పదిలముగ దాగియుండ వీలగునట్లు బ్రిటిష్ రాజ్యమునకు బైటనే వీరు నేరములు చేయుదురు.

వీరు కొరచ, కొరవ లేక ఎరుకల యని పిలవబడు అరవ సంకరమగు కులభాష మాట్లాడుదురు.

వీరు నేరములు చేయనప్పుడు చీల్చిన వెదుళ్ళతో చాపలు, తడకలుచేయుటయు, ఈతచాపలనల్లుటయు, వీరి ముఖ్యవృత్తి. చేటలు, బుట్టలు, త్రాళ్లు, అనేకరకముల నారతో వలలు, పడుగు సరిచేయుటకు నేతగాండ్రు ఉపయోగించు పొడుగాటి కుంచెలుకూడ చేయుదురు.

వీరిలో నేరములు చేయువారు తమ ముఖములకు బూడిద, బొగ్గుపొడి పూసికొని మారు వేషములు తరుచుగ వేయుదురు. వీరు పోల్చ వీలులేనంతచక్కగ మారువేషములు వేయుదురు. పోలీసువారినుండి తప్పించుకొనుటలో గూడ మిగుల చురుకైనవారు.

వీరు బందిపోటు, దోపిడి, కన్నపుచోరీ, పశువులచోరీ చేయుదురు. ముఖ్యముగ బందిపోటు నేరము చేయుదురు.

వీరు రాజమార్గములపై బందిపోటు చేయుపద్ధతి కడు చోద్యముగ నుండును. తమలో నొకనికి బాగుగ మారువేషము వేసి నేరముచేయ వీలుయున్నదో లేదో కనుగొనుటకు ముందుగ వానిని బంపెదరు. వాడు సున్నము, తమలపాకులు అడుగు మిషపైని పోయి అచ్చట స్థితిగతులు తెలిసికొనును. బండిలో నుండువారివద్ద తుపాకులున్నవేమోయని తెలిసికొనుటకు కొన్ని వేళల బళ్లపై రాళ్ళవర్షముకూడ కురిపింతురు. వీరు కూడ కొన్ని సమయముల తుపాకుల నుపయోగింతురు. వీరు తమపాల్బడినవారిని భయపెట్టుటకు ఇనుపగొట్టములలో మందు దట్టించి కాల్చిలోబరుచుకొందురు. వెలగలవస్తువులు ఎక్కడ దాచిరో తెలిసికొనుటకు తమ పాల్బడినవారిని దివిటీలతో కాల్చుచు లేశమైన పరితపించక పశుప్రాయులుగ ప్రవర్తింతురని కూడ వీరికి పేరుగలదు.

దక్షిణదేశమున ప్రక్కగోడలకు కన్నముత్రవ్వి కన్నపు చోరీలు చేయునట్లుగాక వీరు ఇంటిపైకప్పు పగులగొట్టి కన్నపు

చోరీలు మామూలుగ చేయుదురు. సాధారణముగ బళ్లారి ప్రాంతముల గోడలు రాతితోను మంటితోను కట్టుదురు. ఇంటిపైకప్పు కఱ్ఱతోను, మంటితోను, కట్టుటచే పైకప్పు గుండ ఒకయింటిలోనికి సులభముగ ప్రవేశించ వీలుండును.

మామూలుగ పశువులచోరీలుచేసిన కొన్ని దినముల వరకు అనగా వాటిస్వంతగాండ్రు ఆపశువులను వెదకుట మాను వరకు వాటిని బహుదూరము తోలుకొని పోదురు. పిమ్మట వాటిని తమ స్వంతపశువులతో కలిపి ఎంతమాత్రము పట్టుబడకుండ సంతలలో అమ్ముదురు. వీరు కొన్ని సమయముల నొకబండి కుదుర్చుకొని, బండివాడు మార్గముతప్పి కొంతదూరము పోయినపిమ్మట వానిని తన్ని ఆ బండిని, ఎడ్లనుకూడ అమ్మివేయుదురు.

వీరు నేరములుచేయ వెళ్లునప్పుడు వీరి స్త్రీలు పిల్లలు వీరిని వెంబడించరు.

---

## (3) కొరవవాండ్రు

---

దక్షిణ దేశములో వీరిని కొరవవాండ్రందురు. దక్షిణ జిల్లాలకు ప్రక్కనున్న దత్తమండలములో కొరచ వాండ్రందురు. ఉత్తరసర్కారులలోను, నిజాంరాజ్యములోని తెలుగు



కొరవాండ్రు.

దేశమందును, ఎరుకలవాండ్రందురు. బొంబాయి, గుజేరాటు, రాజపుటానా, సెంట్రల్ యిండియాలలో కైకాడీలందురు. బరోడాలో మురగాండ లేక పామలాయని అందురు. వీరుండుస్థలములనుబట్టి వీరిన్ని పేర్లచే పిలువబడుచున్నారు

వీరు ఇండియా దేశములోనున్న దొంగలగుంపులలో నెల్ల పెద్దదిగగన్పడు నొకగొప్ప అరవ సంతతివారు. వీరు సాత్తుపాటి, కావాడి, మేంద్రకుట్టి, మేనపాటి అను నాలుగు గోత్రములవారు. పూర్వకాలములో వీరందరు దక్షిణ ఇండియాలోని దేవాలయములయందు నౌకర్లుగజేరి పలువిధములుగ కొలువుచేయుచుండెడివారు. అందులో సాత్తుపాటివారు విగ్రహాములకు నగలు, పుష్పములు, బట్టలు, అలంకరించువారుగను, కావాడివారు మ్రొక్కుబళ్ళు కావడిలో తీసికొనిపోయి స్వామికి అర్పించువారుగను, మేంద్రకుట్టివారు స్వామికి చెప్పులజోడొకటి కుట్టి అర్పించువారుగను, మేనపాటివారు పూజాసమయముల స్వామియెదుట పాడుచు ఉత్సవములలో రథములు లాగువారుగను ఉండెడువారు.

వీరిని ఉప్పుకొరవలు, కర్వేపకొరవలు, దబ్బకొరవలు, గంపకొరవలు, కావలిగార్ కొరవలు, కుంచికొరవలు, రాతికొరవలనియు వీరి వృత్తిధర్మముల బట్టియు, జీవించు రీతుల బట్టియు, పిలుచుచున్నను వీరందరొక్కరీతిగనే బందిపోటు నేరములుజేసి జీవింతురు. వీరిలో ఉప్పుకొరవలు, కర్వేపకొరవలు, దబ్బకొరవలు, పచ్చాకుకొరవలు, గంపకొరవలు

కడుదుర్మార్గులు. వీరి రాజధానిలో నన్ని వైపుల నిండియున్నారు.

సాధారణముగ వీరు గ్రామముల బైట దిగుదురు. మామూలుగ గుట్టలుగల మెరకస్థలములు జూచుకొందురు. స్త్రీలు, పిల్లలు ఎప్పుడు వీరితోనే యుందురు.

వీరు చూచుటకు అసహ్యముగనుండు ఎడ్డె మనుష్యులు. తలవెంట్రుకలు పొడుగుగ పెంచి తలపైని సిగచుట్టుకొందురు. మొలకొక గుడ్డ చుట్టుకొందురు. అనేకరంగుల గుడ్డలతో కుట్టిన వడిసంచికూడ ఒకటుండును. వీరి స్త్రీలు చిప్పలతోను, గవ్వలతోను, మధ్యమధ్య పలురంగులుగల పూసలతోను, కూర్చబడిన దండలను మెడయందు ధరింతురు. మణికట్టు మొదలు మోచేతివరకు ఇత్తడికడియములును, ఇత్తడితోగాని, సీసముతోగాని, వెండితోగాని ఎక్కువమోటుగ చేయబడిన ఉంగరములు నడిమివ్రేలికితప్ప నితరవ్రేళ్ళకును, పెట్టుకొందురు. వీరు సాధారణముగ నల్లని ముతక చీరొకటి కట్టుదురు. గుర్తించుటకు ఎంతమాత్రము వీలులేకుండునట్లు అంచులు చింపివేసిన దొంగచీరెలుగూడ కట్టుదురు. రెవికె తొడగరు.

వీరు వింతయగు నాచారములుగల యనాగరికులు. వీరు తమ భార్యలను, పెండ్లికాని కొమార్తెలను అమ్ముటయు కుదువబెట్టుటయుకూడ గలదు. అట్టిసందర్భములలో వారికి సంతానముకలిగినను అదియొకతప్పుగ భావించక, అప్పుదీర్చి వారిని తిరిగి తెచ్చుకొందురు.

వీరికొక ప్రత్యేక కులభాష గలదు. అది అరవమునకు చేరినట్లగపడును. వీరు నివసించే స్థలమునుబట్టి అరవము, తెలుగు, కన్నడము మాట్లాడుదురు. వీరు యాసగ మాట్లాడుదురు. వీరొకరితోనొకరు యితరులకు తెలియని మరుగు భాష మాట్లాడుదురు.

ఉప్పు, కర్వేప, గంప, దబ్బ, కావలికార్, కొరవల యొక్క మునలివాండ్రు, స్త్రీలు, ఈతచాపలు, వలలు, వెదురుతడకలు, నీరుతోడుకొనుత్రాళ్ళు, చుట్టకుదుళ్లు పాటుపడి చేయుచు, కరక్కాయలు, ఉస్తికాయలుకూడ పోగుచేతురు. ఒక గ్రామమునుండి వేరొక గ్రామమునకు వీటిని అమ్ముకొనుచు తిరుగుచుందురుగాని వీటినమ్ముటచే తమ జీవనోపాధికి కావలసిన సొమ్మురాదు.

వీరు స్వల్పచోరీలు మొదలు రహదారిబందిపోటు నేరమువరకునుండు అన్నిరకముల నేరములు చేయుదురు. ఆ నేరములు మిగుల దౌర్జన్యముగ చేయుదురు.

సంతలనుండి బాటలపైవచ్చు బాటసారులపై బందిపోటుచేయుట వీరికెక్కువయిష్టము. వీరిలోనొకడు గొప్పరైతువలె వేషమువేసికొని బండ్లదొడ్డికిపోయి, ప్రయాణమెవరెవరు చేయుదురో, ఏమేమి దోచవచ్చునో మొదట తెలిసికొనును. వీడు తనవారు కాచియుండు స్థలమునకు బండ్లవెంబడి పోయి వారికి తామిదివరకు ఏర్పరచుకొనియున్న సైగలను చేయును. అంతట వారందరు ఆ బండ్లనడ్డగింతురు. అప్పుడీ దొంగరైతు

బాటసారులకు అనుమానము కలుగకుండుటకై అచ్చటనుండి తొలగిపోవును. తమ నేమాత్రమెదిరించినను వీరెక్కువ దౌర్జన్యము చేయుటయేగాక ఖూనీలుకూడ చేయుదురు. దివిటి బందిపోట్లలో ఎక్కువ దౌర్జన్యము చేయుదురు. కావలివాండ్ర నెదుర్కొని చంపి ఆడవారిని ఏమాత్రము కనికరములేకుండ నవమానింతురు.

వీరు కన్నపుచోరీలు చేయుటలో గట్టివారు. సమీప గ్రామములకుపోయి సమాచారములు పోగుచేసికొనివచ్చుటకు వీరి నాయకుడు ముసలివారిని, స్త్రీలనుబంపును. తాము తయారుచేసిన వస్తువులు తీసుకొనిపోయి చుట్టుప్రక్క గ్రామములలో చాలదినములు సంచరించి తమగుంపునకు పనికల్పించుటకు కావలసిన సమాచారములు తెలిసికొనివచ్చి తమ నాయకునికి తెలియజేతురు. ఆతడు పెరుమాళ్ళను కొలిచి, కొందరిని మకాములోనుంచి మిగిలినవారిని ముగ్గురు మొదలు అయిదుగురు వరకునుండు గుంపులుగ నేర్పరచి నేరములు చేయుటకు పంపును. నేరముచేయబోవుస్థలము దూరముందున్న యెడల కావలసిన అన్నము మూటకట్టుకొని వెదురు కర్రలు పుచ్చుకొని ప్రతిగుంపు పోవలసినస్థలమునకు పది కొండు, పన్రెండు గంటలలోపలనే చేరులాగున బయలుదేరి తమతమ పనులపై పోదురు. వీరు తమతో తీసుకొనిపోవు "సిల్లాకోలు"అను కన్నపుకోలతో గడియవద్ద గోడకు కన్నము త్రవ్వి, ఇంటిలోపలినుండి బయిటకు తాము స్వేచ్ఛగా వచ్చుటకు దారేర్పరుచుకొందురు, ఇంటిలోపలను, బైటనుకూడ కాల్చిన

నిప్పుపుల్లలుండును. ఇద్దరు, ముగ్గురుమాత్రమే ఇంట్లో ప్రవేశింతురు. మిగతవారు బయిట ఇంటిచుట్టు కావలియుండి ప్రమాదమేదైన రానున్న యెడల సంజ్ఞలచే లోనివారికి తెలుపుదురు. వీరి ప్రయత్నము కొనసాగి నేరముచేయుటలో నెగ్గినయెడల దొంగసొత్తు బైటనున్న తమవారికందింతురు. వారు ఆ గ్రామమునకు కొంతదూరములో ముందుగ తామేర్పరుచుకొన్న స్థలమునకు కొనిపోదురు. అచ్చట వీరందరు జేరుదురు. వీరందరాసొత్తు అచ్చటనుండి వెంటనేతీసికొని తమమకామునకు దూరమందుండు మరుగుప్రదేశములలో తెల్లవారకమునుపే పాతిపెట్టి నగదుమాత్రము పట్టుకొని నెమ్మదిగ తమగుడిసెలకు జేరుదురు. కొంతకాలము గడిచినవెనుక వీరు దానిని తమలోతాము సమముగ పంచుకొని వీలగుస్థలముల పాతిపెట్టుకొందురు. కొన్నిసమయముల వీరిపై అనుమానమెక్కువ లేకుండయున్నప్పుడు తమయిండ్లలోనే మధ్యరాటకు సమీపమున దాదాపు ఒకగజములోతున క్రిందకన్నముత్రవ్వి దొంగనగలు పాతిపెట్టుదురు. లేదా చుట్టునుండు మట్టిగోడలలో పూడ్చుదురు. వీరు నేరములు చేయుచున్నప్పుడు ఆకస్మికముగ పట్టుకొనదలచిన, తమ కర్రలయొక్కయు, ఆయుధములయొక్కయు, సహాయముచే పారిపోవ ప్రయత్నించుదురు.

తప్పిపోయిన పశువులను నిర్భయముగ అమ్మవీలగులాగున విశేష దూరస్థలములకు తోలుకొనిపోదురు. పశువుల చోరీ చేసినప్పుడు గుంపులోనిమిగతవారు తమపై గ్రామస్థులకుగల అనుమానము నివర్తింపజేసికొనుటకు ఆస్థలము విడిచి

తప్పుజాడలు చూపించుచు సాధారణముగ మరియొకప్రక్కకు పోదురు. వీరిలో కొందరు పట్టపగలు గొర్రెలచోరీ చేయుటలో మొనగాండ్రు. చిన్నపొదలవద్దగాని, గుట్టలసమీపమునగాని, మేయుచుండు గొర్రెలమందను వీరిలోనొకడు చూచిన, కాపరిచూడకుండ ఒంటరిగ మేయుచున్న గొర్రెను మెల్లగ పట్టుకొని దానినాలుక పైకిలాగి ఈతముల్లుగాని తుమ్మముల్లుగాని గ్రుచ్చి అరవకుండ చేయును. పిమ్మట దానికాళ్లు త్రాటితో కట్టి దానినక్కడ వదలి తన త్రోవను తాను మార్గస్థునివలెపోవును. పాపమాజంతువు ఇతర గొర్రెలతో కలిసి పోజాలక సాయంత్రమువరకు అక్కడ పడియుండును. గొర్రెలకాపరి అదితప్పిపోవుట తనమంద లెక్కపెట్టుకొనువరకు తెలిసికొనజాలడు. రాత్రి ఈ కొరవ అచ్చటకుపోయి దానిని జంపి తోలు, మాంసము తీసికొని వెళ్లిపోవును.

వీరి స్త్రీలు, పిల్లలు పట్టణములలోను, గ్రామములలోను తాముండునప్పుడు కోళ్లచోరీ చేయుదురు. వీరొకయింటివద్దగాని గుడిసెవద్దగాని కోళ్లనుచూచిన బియ్యము కొంచెముచల్లి అవి తమతోవచ్చులాగున మార్గముపొడుగునను కొంచెముకొంచెముగ చల్లుచు ఆ యిండ్లుదాటి కొంతదూరము పోయినవెనుక అవి కూయకుండ వాటిమెడ నులిమి తమ బుట్టలలో దాతురు.

పండ్రెండుమొదలు ఇరువదినాల్గు అంగుళములవరకు నిడుపుగల్గి ఒకకొనను పిడివేయబడి మరియొకకొనను ఉక్కుపొన్నుగల ఇనుపపనిముట్టు వీరు ఉపయోగింతురు. లావు

పాటి వెదురుకర్రలు, వడిసెలలు, కొడవళ్లు, పాళకత్తులుగూడ వీరి ఆయుధములే.

వీరు దొంగసొత్తు తగినధర వచ్చినతోడనే విక్రయింతురు. సాధారణముగ రూపాయఎత్తు బంగారము ఒకరూపాయకు విక్రయించుదురు. వీరు తమవద్దనుండు ఎక్కువసొమ్ము కాసులుగమార్చి బొంతలలోపెట్టి కుట్టుకొందురు. వీరు దొంగసొత్తు గాడిదెలనుకట్టుచోట్లను, పెంటకుప్పలలోను, పేడకుప్పలలోను, పొయిలలోను, మరుగుదొడ్లలోను పూడ్చిపెట్టుదురు. స్త్రీలు తమవద్ద నగలు దాచుటలో తెలివైనవారు. ఒక పోలీసుఉద్యోగస్థుడు వీరుండుతావునకు పోయిన వీరు నీళ్ళుతెచ్చు మిషపైని తమకుండలలో దొంగసొత్తు వేసికొనివెళ్ళి దానిని పాతిపెట్టుటకు త్వరపడుదురు. వీరు అతివేగముగ దానిని పాతిపెట్టి ఆస్థలమువద్ద గొంతుకూర్చుందురు. వీరికి గ్రామములోని స్త్రీపురుషులు రిసీవర్లు. వారు వీరికి చోటిచ్చుచు, ముందుగ కావలసినసొమ్మునిచ్చుచు సావకాశముగ వీరుతెచ్చియిచ్చు దొంగసొత్తు విక్రయించుదురు. చాలాభాగము వీరితో కల్లు,సారాయి గిడ్డంగివారు వ్యవహరించుదురు.

వీరు నేరములు ఒకరరుపడరు. ఒకవేళ ఒకరరుపడినను కేసువిచారించు కోర్టులోగాని మేజస్ట్రీటువద్దగాని దానిని నొప్పుకొనరు.

వీరు పెక్కుభార్యల పెండ్లాడవచ్చును. విధవ స్వేచ్ఛగా

వివాహమాడవచ్చును. వయస్సువచ్చిన పిదప స్త్రీలకు వీరు వివాహముచేయుదురు.

ప్రతి గుంపునకొక నాయకడుండును. ఆ గుంపువారు అతనిని ఎన్నుకొని మిగులగౌరవముగ జూతురు. అతనిమాటయే చట్టము. అతడు సర్వాధికారి. వీరు శకునములు పాటింతురు.

వరుసగ వీరు కొన్ని నేరములలో జయమొందినప్పుడు, వేపచెట్టుక్రింద పెరుమాళ్ళపేరిట తాము కట్టిన విగ్రహమును జేరి, బంగారునాణెముల నర్పింతురు.

---

III ప్రకరణము.

# దండాసీలు.

ఈరాజధానిలో వీరు గంజాం జిల్లాలోను, బెంగాలు రాజధానిలోని ఒరిస్సాజిల్లాలోను విశేషముగ నుందురనిచ్చు ఓఢ్ర తెగవారు. వీరు రాధాకృష్ణుల వంశస్థులుగ చెప్పుకొందురు. విశాఖపట్నం జిల్లాలో కొంచెముగనున్నారు. వీరిప్పుడన్ని వృత్తు లనవలంబించుచు జనులతో కలిసిమెలిసియున్నారు. దక్షిణాదిని కళ్ళర్లు మరవర్లవలెను, నెల్లూరులో ఏనాదులవలెను, వీరిని జనులు గ్రామకావలివారుగను, నౌకర్లుగను, నియమించి వీరుచేయు కావలిపనికి 'మేరా'అను భత్యమును,ఈనాము

లనుయిచ్చి తమసొత్తు భద్రపర్చుటకు వీరిని జబాబుదారులుగ జేయుటచే వీరురాత్రులు గ్రామములలో గస్తీతిరిగి నేరముల నాపి, జరిగిన నేరములను కనిపెట్టుదురు.

వీరందరును కష్టపడి పనిచేయు దృఢకాయులు.

వీరు తెలుగు, హిందుస్తాని, ఓఢ్ర భాషలు మాట్లాడు దురు.

వీరు బందిపోటు, దోపిడి, పశువులచోరీ, మొదలగు నవి చేయుటకంటె కన్నపుచోరీ విశేషముగ జేయుదురు. వీరు గొర్రెలను, పొలములలోని ధాన్యపుకుప్పలనుండి ధాన్యమును తినుటకై దొంగిలించి, కొండలలో తరుచుగ దాచుకొందురు.

వీరేగ్రామములలోను, ఆగ్రామములలో కావలివారు గను, రైతులవద్ద నౌకర్లుగనుండు దండాసీలకు తెలియకుండ నేరము లెంతమాత్రము చేయలేరు. వీరిని గ్రామములలో కావలివారుగను, నౌకర్లుగను నియమించునప్పటికిని వీరు దొంగవృత్తినింకను పూర్తిగ మానలేదు.

వీరు సాధారణముగ నేరములు చేయబోవుటకు ముందు దొంగవృత్తిలో గట్టినేర్పరియగు తమ ముఠానాయ కుని సలహా తీసికొందురు. అతడు వీరితో నేరముచేయుటకు పోనప్పటికిని వీరు పట్టుబడకుండ నేరముచేసినప్పుడు దొంగ సొత్తులో కొంతభాగమును ఆనాయకునికిత్తురు. బర్హాంపురం

లోని దండాసీలు కటక్, పూరి జిల్లాలలో నేరములుచేయుటకు రైలుప్రయాణముజేతురు. తిరిగి తమయిండ్లకు వచ్చునప్పుడు రోడ్డుప్రయాణముగాని రైలుప్రయాణముగాని జేయుదురు. వీరు రైలుప్రయాణము చేయునప్పుడు ప్రజలు తమను జగన్నాథమునుండివచ్చు లేక పోవు యాత్రస్థులుగ భావించుటకై తులసిపూసలదండలు ధరింతురు. నేరములలో జయముగలిగిన నొకపశువును బలియిత్తుమని తమగ్రామదేవతకు ఆనగట్టుదురు.

వీరు విశేషముగ కన్నపు-చోరీలు గడప క్రింద కన్నము త్రవ్విగాని వీధిగుమ్మపు గడియవద్ద గోడకు కన్నముత్రవ్విగాని చేయుదురు. దొడ్డిగుమ్మముగుండ యింటిలోనికి ప్రవేశింతురు. అవసరమునుబట్టి ప్రక్కగోడలకుగూడ కన్నములు త్రవ్వుదురు. వీరొక యింట్లో ప్రవేశించిన ఎంతగట్టికొయ్యపెట్టెనైనను సులభముగ పగులగొట్టుదురు లేదా దానిని ధైర్యముగ మోసికొనిపోయి కొంతదూరములో పగలగొట్టుదురు. నిద్రబోవు పిల్లల ఒంటిపై నగలనుగూడ తీసికొందురు. పట్టుబడుదుమనే భయమెంతమాత్రము లేక ఇత్తడిసామాగ్రులనుగూడ దొంగిలింతురు. ఏదైన నేరముచేసినట్లు ఒక దండాసీ అనుమానించబడినపుడు వాడు పోలీసువారు ఆకేసు విషయములో చర్యజరుపుట మానిరని తెలిసికొనువరకు నెలల తరబడిని దూరమందుండు గ్రామములకు పారిపోయి కనపడకుండ దాగును.

వీరు కన్నపుచోరీ చేయుటకై ఆకుగునపము, సూదిగునపము, పలకగునపములలో ఒకటిరెంటిని తమతో తీసికొనిపోదురు.

స్వగ్రామములలోనే రిసీవర్లును, దాగుటకు చోటిచ్చువారునుకూడ వీరికిగలరు. ఒకానొకసమయమందు గ్రామోద్యోగస్థులుకూడసహాయులగుదురు. పోలీసువారు నేరముచేసినవారినందరిని పట్టుకొనమని వాగ్దానముచేసి, అప్పుడప్పుడు వీరు చేసిన నేరములజాడలు వీరినాయకునివద్దనుండి తెలిసికొందురు. వీరొకప్పుడు కొంతదొంగసొత్తును, శిక్షవేయించుటకు నేరము చేసినవారిలోనొకరిని, పోలీసువారికి ఒప్పగించి చెరసాలకు పోవువాని కుటుంబపోషణకై కొంతదొంగసొత్తు దాచిపెట్టుదురు.

వీరు విష్ణుమతస్థులు "రామనంది" అనగా రామానుజులవారిశిష్యులు. వీరి కులస్థుడగు "బెహరా" బ్రాహ్మణులవలెనే వీరి మతవిషయములగు కార్యములను చేయించును.

---

## IV. ప్రకరణము.

# కొండదొరలు.

---

వీరు విశాఖపట్నంజిల్లా విజయనగరము, చీపురుపల్లి, గజపతినగరము తాలూకాలలో విశేషముగనున్నారు. విశా

ఖపట్నం జిల్లావిడిచి ఇతరజిల్లాలకుపోయి గొప్పరైతులవద్ద కావలివారుగను, పాలికాపులుగను కుదిరియున్నప్పుడు తాము కాపులమనియు, వెలమలమనియు చెప్పుకొందురు.

వీరు రైలుపడినప్పటనుండి విశేషదూరదేశము ప్రయాణము చేయుచున్నారు. కొందరు రంగూనులోనున్నట్టు తెలియుచున్నది. మరికొందరు నిజాంరాజ్యమునకు, కృష్ణా, గోదావరి, గంజాం జిల్లాలకును ఇంకనితరదూరదేశములకు 'తూర్పువాండ్రు' అని పేరుపెట్టుకొని పోవుచున్నారు.

వీరు కొన్నివేళలయందు ఒకరిద్దరు ఆడవారిని, ఒక కంసాలిని తమతోతీసికొని బయలుదేరుదురు. వీరు నౌకరీ సంపాదించుకొనబోవు కాపులవలె నటించుచు సాధారణముగ కొండక్రిందనుండెడి తోటలలోను, తోపులలోను, పాతసత్రములలోను దిగుదురు. తేనెపట్లు, ఎలుకలు, కుందేళ్ళు మొదలగువాటిని వెదుకు మిషపైనిపోయి నేరములుచేయ నిండ్లు చూచుకొందురు. సామాన్యముగ కల్లుగాని సారాయిగాని త్రాగుదురు.

వీరు తెలుగుభాష మాట్లాడుదురు.

వీరు కావలివారుగ నియమింపబడినపుడు తమయజమానులకు విశేషనమ్మకము గలుగువరకు బాగుగ నడుచుకొనుచు పిమ్మట తమతెగవారికి రహస్యముగ సమాచారములనంపి, వారు తమయజమానుల ఇండ్లలోగాని ఆగ్రామము

లోని యితరయిండ్లలోగాని గొప్పకన్నపుచోరీలు చేయుటకు వీరు సహాయపడుదురు.

నేరములుజరిగినపిమ్మట ఈదొంగపాలికాపు ఇందును గురించిన కలవరము సద్దుఅణుగువరకు కొంత కాలము తన యజమానివద్దనుండి పిమ్మట బంధువుల చూచివచ్చుమిషపైని యజమానివద్ద సెలవుతీసుకొని తనవారినిచేరి తనవంతుదొంగ సొత్తు పుచ్చుకొనును. వీరు పుట్టుకనుండి దొంగలుగ నుండుటచేన్యాయముగజీవించుట వీరికెంతమాత్రముయిష్టముండదు.

వీరు కన్నపుచోరీ చేయుటలో గట్టివారు. నిద్రించు స్త్రీల చెవులనుండికమ్మలు తరుచుగ త్రెంపుకొందురు.

వీరు కన్నపుచోరీచేయ వెళ్ళినప్పుడు ఒకడు సాధారణముగ గడియలకెదురుగగాని లేదా గడపక్రిందనుగాని కన్నము త్రవ్వును. మరియొకడు కన్నముత్రవ్వునప్పుడు చప్పుడుగాకుండ పైనుండిపడు ఇటికలను, రాళ్ళను తనబట్టలోపట్టును. గ్రామస్థులు వీరికి తొందరగలుగజేసి వెంబడించునపుడు వారిపై రువ్వుటకు కొన్ని రాళ్ళుకూడ పోగుచేసికొందురు. వీరు నేరము చేయుటకు అయిదారుగురువంతున గుంపుగుంపుగ బోదురు.

వీరివద్ద పన్నెండు, పదిహేను అంగుళముల పొడుగు గల్గి త్రికోణాకారముగగాని ఇటుకరాయివలె నిడుపువాటుగగానియుండి ఒకకొన వాడిగనుండొక ఇనుపపనిముట్టు ఉండును

వీరు కొన్నిసమయముల తమతోతీసికొనిపోవు ఆడ వాండ్రచేత దొంగసొత్తు రైలుపై యిండ్లకుబంపి తాము మాత్రము తమయిండ్లజేరకపూర్వమే నేరములుచేయుటకు క్రొత్తస్థలములను వెదుకుదురు. వీరివద్ద కల్లు, సారాయి దుకాణదారులుకూడ దొంగసొత్తు కొందురు.

---

V. ప్రకరణము.

# దొమ్మరవాండ్రు

---

వీరు ఈ రాజధానిలోని పెక్కుజిల్లాలయందును నిజాము, మైసూరు రాజ్యములయందును చెదిరియున్న యొక పెద్దతెగవారు. వీరి తెగలో ననేకములగు నంతర్భాగములున్నవి. నెల్లూరు, గుంటూరు జిల్లాలలో నివసించువారు మిగుల దుర్మార్గులు. దొమ్మరిజాతిలో వీరొక ప్రత్యేక శాఖగనున్నారు. వీరి పూర్వులు నెల్లూరు జిల్లాలోని రెడ్లవద్ద కొలువుండియుండుటచే వీరిని రెడ్డిదొమ్మరులు అని బిలుతురు.

వీరికి భూవసతి లేదు. పందులు, గాడిదెలు మొదలగు జంతువుల నుంచుకొందురు. వీరు సంఖ్యానియామకము లేకుండ గుంపుగుంపులుగ దేశాటనముచేయుచు కొద్దికాలముగాని

చిరకాలముగాని వేర్వేరు స్థలముల మకాముచేయుదురు. వీరు బసచేయుస్థలములయందు చూచుటకు బండిగూటివలెకనపడు గుడిసెలు వంపువెదుళ్ళతోను, దుప్పట్లతోను అతిసులభముగ తీసికొనిపోవీలగులాగున కట్టుకొందురు. గ్రామముల బయిట ఒకమైలుదూరమందుండు పొలములలోగాని చెరువు ప్రక్కల నుగాని మకాముచేయుదురు.

నెల్లూరు, గుంటూరు జిల్లాలు దత్తమండలములోని కొన్ని భాగములు వీరు నేరములుచేయుటకు తిరుగుప్రదేశము లని చెప్పవచ్చును. వీరు రైలు, తపాలాఫీసుల నెంతమాత్రము ఉపయోగపర్చుకొనరు. మరియు పనిచేయు స్థలసమీపముల నేరములెన్నడును చేయక కొంతదూరమందుండుగ్రామములకు పోయి, నేరములుచేసి తెల్లవారక మునుపు తిర్గి తమ మకాములకు తప్పక జేరుదురు.

వీరు దృఢశరీరముగల బలాఢ్యులు. వీరు తలపై మూడువైపుల జులపాలనుంచుకొని వేరొక జాతివారివలె కనబడుదురు. పలువిధములగు శరీరవ్యాయామములు చేయుట లో స్త్రీపురుషులందరును నేర్పరులు. వీరిస్త్రీలు ఎక్కువ అందకత్తెలు. వీరికి పసినాటనుండియు గడయెక్కి ఆడుట, త్రాటిపైనాడుట, మొగ్గలు, పల్టీలువేయుట మొదలగునవి నేర్పుదురు. మరికొందరికి సంగీతము చెప్పించుటచేవారు జారత్వ ముచే జీవనము చేసికొందురు. వీరు అతిజారులగుటచే కాపు, కమ్మరయితులతో నెక్కువగ వ్యభిచరించుచు వారిప్రాపకము

విశేషముగ గల్గి తమవారికి మిగుల సహాయులుగనున్నారు. సామాన్యముగ దొమ్మరవాండ్రు కల్లుత్రాగుదురు. వీరు గోవునుపూజించుటచేత దానినితప్ప ఇతరజంతువులమాంసము భక్షింతురు. పందిమాంసము ఎక్కువగ తిందురు. సాధారణముగ పల్లెటూరి జనులు వీరినిజూచి మిగుల భయపడుటచే వీరుచేయు నేరములెక్కువగ పైకిరావు.

వీరు సంకరమగు తెలుగుభాష, తమభాషయగు ఒక మాదిరి మహారాటిభాషయు మాట్లాడుదురు.

బిచ్చమెత్తుకొనుట వీరివృత్తిగ పైకగపడునుగాని కొయ్యదువ్వెన్నలు, ఈతచాపలు విక్రయించియు, గాడిదెలు, పందులు, పశువులు మొదలగు పశువుల వ్యాపారము చేసియుగూడ జీవించునట్లు నటింతురు. వీరికి కొన్ని పశువులుండుటచే వీరు పశువులచోరీ చేయుటకు వీలగుటయేగాక సమయమువచ్చినప్పుడు తమ గౌరవాధిక్యతను గూర్చి చెప్పుకొనగల్గుచున్నారు.

వీరు బందిపోటు, దోపిడి, కన్నపుచోరీ మొదలుగాగల నేరములన్నియు చేయుదురు. పశువులను, గొర్రెలను చోరీచేయుటలో నేర్పరులు. వీరు తమ బిడ్డలు తెలివితేటలతో నేరములుచేయగలందులకై పసితనమునుండియు కోళ్ళుమొదలగునవి దొంగిలించుట వారికి నేర్పుదురు.

వీరు స్వయముగాగాని ఆడవారినుండిగాని సమాచారములు తెలిసికొందురు. స్త్రీలు దువ్వెనలు, చాపలు అమ్మ

నట్లు గ్రామములలోకిపోయి నటించుచు నేరముచేయుటకను కూలమగు సమాచారములు తెలిసికొందురు. వ్యభిచారము చే జీవించెడు స్త్రీలుగూడ కొన్ని సమాచారములు తమవృత్తి వలన తెలిసికొని వచ్చి వీరికి తెలియపరచుదురు.

వీరు ఒక్కొక్క తడవ యిద్దరిద్దరు లేక ముగ్గురుముగ్గురు బయలుదేరి ముందేర్పరుచుకొన్న యొకతావున గుమిగూడి పిదప నేరముచేయదలచుకొన్న స్థలమునకు పోవుదురు. దోపిడి, బందిపోటు నేరములు చేయునప్పుడు వీరి పాల్పడువారిని జడిపించుటకు ముందుగ కొన్ని రాళ్ళు రువ్వి వెంటనే యింటిలోనికిపోయి అవసరమున్న యెడల ఇంటిలోనివారినికొట్టి, తమ చేతికి దొరుకునంతసొత్తు పట్టుకొని వారిప్రాణములు కుదుట బడకపూర్వమే పారిపోవుదురు. వీరెల్లప్పుడు మారువేషములు వేసికొని నేరములు చేయుదురు. నేరములుచేయు ఇతర తెగవారివలె పురుషులు తమ మకాములువిడిచి బైటకు పోరు. వీరు పట్టుబడినప్పుడుగాని శిక్షనొందినప్పుడుగాని దొంగపేర్ల నెంతమాత్రము చెప్పక నిజమగుపేర్లు చెప్పుదురు. గొప్ప నేరములుచేయుటకై వీరుతరుచుగ దొంగదాసర్లతో జేరుదురు. పట్టుబడకుండ నేరముచేసిన పిమ్మట దొంగసొత్తు విక్రయించునపుడుతప్ప ఇతరసమయములయందు అన్యుల సహాయముగాని సలహాగాని కోరరు.

బందిపోటు, దోపిడి మొదలగు గొప్పనేరములు చేసి తిరిగివచ్చునప్పుడు తప్పిపోయిన తమపంధులను, గాడిదలను

వెదకుటకు వెళ్ళినట్లు బొంకుదురు. వీరు నేరములు చేసినట్లు ఎంతమాత్రము ఒప్పుకొనక నిరపరాధులమని మొండివాదము చేయుదురు. ఊరూరతిరుగు నేరస్థులకంటె వీరిని నిగహాలో నుంచుట సులభమేగాని, నేరములు చేయునప్పుడు వీరిని కని పెట్టి పట్టుకొనుట బహుదుర్లభము.

వీరు నేరములు చేయునపుడు ఎదుర్కొనుటకు తప్పించు కొనుటకు కర్రలు, లాఠీలు ముఖ్యముగ నుపయోగింతురు.

సాధారణముగ వీరు దొంగ నగలనుకరిగించి రూపుమార్చి వాటిని విక్రయింతురు. దొంగసొత్తు నెంతమాత్రము తమవద్ద దాచక కొద్దివెలకు రిసీవర్లకు అతిత్వరితముగ విక్రయింతురు. మామూలుగ దొంగసొత్తు తాముండుతావునకు దూరమున నుండు నిర్జనప్రదేశములలో పాతిపెట్టుదురు. వీరు గాడిదెలను కట్టియున్న స్థలములలో కొన్నిసమయముల పాతిపెట్టుదురు. వీరివద్ద కాపులు, కమ్మలు దొంగసొత్తుకొందురు. తరచుగ వీరు దొంగసొమ్ముతో పశువులనుకొందురు. పోలీసువారు వీరివద్ద క్రొత్తపశువులను కనిపెట్టినయెడల వాటినిగురించి వీరుచెప్పు వృత్తాంతములను ధృవపర్చుకొనవలయును.

వీరిలో బాల్యవివాహములు లేవు. విధవలు స్వేచ్ఛగ వివాహమాడవచ్చును. పురుషులు పెక్కు వివాహములాడ వచ్చును. ఇతరజాతిస్త్రీలను తమలోకల్పుకొని వారికిగలుగు సంతతిని దొమ్మర్లుగనే వీరు భావించుదురు. చనిపోయినవారిని పాతిపెట్టి గోరీలుకట్టుదురు.

వీరి నాయకునిపేరు ముట్లిగురు. అతడే వీరికులపెద్ద. వీరిపై వానికి సర్వాధికారముగలదు. ఇతడు కడపజిల్లా చిట్టివేలులో నుండును. నేరములు చేయించుటకును, గుంపులోని వారికి కష్టసమయములలో నుంచిసలహానిచ్చి సాహాయము చేయుటకును, కులపంచాయితీలు పరిష్కరించుటకును ప్రతి గుంపునకును పెద్ద ఒకడుండును.

వీరు విష్ణుమతస్థులగుటచే విష్ణుమూర్తి వీరి ముఖ్య దైవము. ఆయనను కొలుచుటకు తిరుపతి వెళ్ళుదురు.

---

## VI ప్రకరణము.

# లంబాడీలు

---

లవణాని యనుపదమునుండి వచ్చినరూపము లంబడీ. లవణమనగ ఉప్పు. వనచారి యనుపదముయొక్క రూపము బ్రింజారి. వనచారియనగ అడవిలో తిరుగుచుండువాడు. వీరు సుగ్రీవుని సంతతివారుగ చెప్పుకొందురు. వీరు రైలులేనికాలములో ఉప్పుకావళ్లు మోయుచు నడవులలో సంచరించుచుండెడివారు. వీరిని సుగాలీలనికూడ బిలుతురు.

వీరు ఈరాజధానిలో బళ్లారిజిల్లాలో నున్నంత ఎక్కువగ మరియేయితర జిల్లాలలోను లేరు. వీరు ఇండియాదేశ

మంతట విశేషముగ వ్యాపించియుండుటచే వీరినిగురించి విస్త రించి చెప్పనవసరము లేదు.

వీరు ఆర్యుల ముఖవైఖరియు ఎత్తైనముక్కులును గల్గి యుందురు. వీరిఆడవారు విచిత్రమగు దుస్తులు నగలు ధరించుటచే బాగుగ తెలిసికొనవచ్చును. వీరు మార్వాడీదేశము నుండి వచ్చియున్నట్లగపడుదురు. వీరిలో పురుషులు అలసట సహించి దూరప్రయాణముల చేయసమర్థతగల సాగసైన బలశాలులు. వీరు గ్రామములబైట గుడిసెలలో నివసింతురు. పొట్టియిజారు, ధోవతి, పలురంగులతలరుమాళ్లు, టోపీలు మామూలుగ వీరు వేసికొను దుస్తులు. వీరి ఆడవారు సాధారణముగ ఆయాస్థలములందుండు యితరస్త్రీలకంటె కొంచెము పొడుగుగను, రూపవంతులుగను ఉందురు. వీరు ధరించు విస్తారమగు నగలనుబట్టి వీరిని సులభముగ గుర్తింపవచ్చును.

వీరిస్త్రీలు బుట్టాలువేయబడిన ఎర్రని లేక ఆకుపచ్చ రంగుగల కార్వారుగుడ్డ లంగాలు గట్టుదురు. ముందువైపునను భుజములమీదను బుట్టాలువేయబడిన రెవికెతొడిగి వెనుక ప్రక్కను పలురంగులుగల దారములతో దానినిముడివైతురు. ఈదారపుకొనలు గవ్వలతోను, పూసలతోను అలంకరింతురు. బుట్టాలువేయబడిన కార్వారుబట్ట ఒల్లెగ వేయుదురు. ఆబట్ట కొన్నికుచ్చులుగలిగి గవ్వలుకట్టిన దారములతో ప్రక్కగ వ్రేలాడుచుండును. వీరు లెక్కలేనన్ని నగలు ధరింతురు. పది లేకయిరువది చేరులుగల పూసలపేరులచివర నొకగవ్వను

కొలికిపూసగ గుర్రపువెంట్రుకతో గ్రుచ్చుకొందురు. ఈ కొలికిపూసను 'చీడ్' అందురు. ఇత్తడితోగాని కొమ్ముతో గాని చేయబడిన పదిలేకపండ్రెండు కడియములు మోచేతుల వరకు ధరించి, కుడిమణికట్టునకు ఒక అంగుళము వెడల్పు గలిగి బుట్టాలువేయబడిన పట్టుగుడ్డ కట్టుకొందురు. వివాహ మయిన పడుచులుమాత్రము దంతముతోగాని కొమ్ముతో గాని చేయబడిన అందెలు పెట్టుకొందురు. భర్త గతించిన వెనుక వాటిని తీసివేయుదురు. వీరు తమకణతల కిరువైపుల నుండు వెండ్రుకల కుచ్చులకు 'ఘుఘ్రీ'అనబడు విచిత్రమగు ముళ్లువేయుదురు. అవిలేకున్న పెండ్లికానట్టు తెలిసికొన గలము.

వీరు తమలోతాము లంబాడి లేక లభానిభాష మాట్లా డుదురు. అది హిందుస్తాని మార్వాడిభాషల మిశ్రమము. తెలుగు, కన్నడముకూడ మాట్లాడుదురు.

వీరు వ్యవసాయముచేసి, పశువులమేపి, వంటచెరుకు, గడ్డియు విక్రయించి జీవింతురు. ఈడిగవాండ్రు కల్లుగీయుట కును, మోసికొనిపోవుటకును తమకుసాహాయ్యులై పనిచేయు టకు వీరిని తరుచుగ నియమించుదురు.

వీరెల్లప్పుడు అడవులలో తిరుగుచు మైసూరురాజ్యము లోను దత్తమండలములోను గొప్ప బందిపోటు నేరములు చేసి విశేష శ్రమనిచ్చిరి. వీరు 1877-1882 సంవత్సములకు మధ్యను నూటికి తక్కువగాకుండ బందిపోటు నేరములుచేసిరి.

మైసూరు గవర్నమెంటువారు ఆ నేరములన్నియు నొకపట్టిగ నచ్చొత్తించిరి.

వీరిప్పుడు రాజమార్గములపైని, ఇండ్లలోను, చెదిరియుండు పల్లెలలోను బందిపోటు నేరములు తగుమాత్రముగ చేయుచు, పశువులచోరీలు, ధాన్యపుచోరీలు చేయుదురు. వీరు దొంగతనముగ సారాయిబట్టీలుపెట్టి సారాయికూడ తయారుచేయుదురు.

కొడవళ్ళు, గుండుకత్తులు లేక కఱ్ఱలు వీరి యాయుధములు. వీరికాటంకము కల్గునప్పుడు దౌర్జన్యముచేయుదురు. నేరములు చేయుటకు బయలుదేరకమునుపు శకునములు జూతురు.

వీరివద్ద దొంగసొత్తు అందగు కొందురుగాని ముఖ్యముగ సారాయిఅంగడివారు, కోమట్లు కొందురు. తరచుగ గ్రామాధికారులుకూడ కొని విశేషలాభము పొందుదురు. గుర్తించదగిన సొత్తును వీరు మకాముచేసియుండు స్థలములకు తీసికొనిపోక నదులలోని ఇసుక తిన్నెలు మొదలగు అనుకూలస్థలములలో పాతిపెట్టుదురు. దొంగిలించిన పశువులను కొంతకాలము గడిచినపిమ్మట విడిగాగాని జంటగగాని దూరమున జర్గు పశువులసంతలలో విక్రయింతురు.

వీరి ప్రతి తండాకు ఒక్కొక్క పెద్ద యుండును. అతనిని నాయకుడందురు. అతడు వీరిపై యధికారముగల పెద్దయగుటచే వీరి కుల్లతగయిదాలు పరిష్కరించి జుల్మానాలు

వసూలుచేయును. నేరములు చేయుటగూడ ఏర్పాటుచేయుచుండును.

సంఘములో వీరు కాపులకంటె తక్కువగను, ఏనాదులు, ఎరుకలవాండ్రు, వడ్డర్లకంటె నెక్కువగను తలచబడుదురు. వీరి వివాహసాంప్రదాయములు బహువిచిత్రముగనుండును. బాల్యవివాహములు చేయుదురు. విధవావివాహములుగూడ నిరాటంకముగ జేతురు. ఇతరజాతి స్త్రీలను వీరు పెండ్లిచేసుకొన నంగీకరించినను వారికిగలుగు సంతానము మూడుతరములు దాటువరకు నిజమైన లంబాడీ మతస్థులుగ భావించరు.

వీరందరికి ఆటపాటలయందు విశేషప్రీతి. స్త్రీ పురుషులందరును యథేష్టముగ తిని, త్రాగి త్రుళ్ళుచుందురు. వీరు పాడునపుడు నగారా లేక ఢోల్ (ఒకవిధమగుమద్దెల) వాయించుదురు. కొన్నిసమయముల రామాయణ, మహాభారతములలోని కొన్నికథపట్లను పాడ మొదలుబెట్టుదురుగాని తరుచుగనవి యసందర్భముగ నుండును.

---

## VII ప్రకరణము.

# జోగివాండ్రు

---

వీరు రెండుతెగలుగ విభజించబడిన తెలుగుజాతి బిచ్చగాండ్రు.

i ఒక తెగవారు ఉత్తరార్కాటు జిల్లాలో కొన్ని ప్రాంతముల పూసల నమ్ముకొనుచుందురు. వారిని పిచ్చిగుంట జోగులందురు.

ii మరియొక తెగవారు ఉత్తరార్కాటు, దక్షిణార్కాటు, చెంగల్పట్టు, చిత్తూరు జిల్లాలలో పందులను పెంచుచు తిరుగుచుందురు. వీరే నేరములు చేయువారు.

వీరు ఒకగ్రామము బైటగాని నీళ్లులేని చెర్వుప్రక్కల గాని నిలుతురు. వీరు తమగుడిసెలు అయిదు వెదురుబద్దలను వంచి తాటియాకు నేసి కట్టుకొందురు. ఈ గుడిసెలు ఒక వైపున పూర్తిగ తెఱవబడి మిగతవైపుల మూయబడి యుండును. మారువేషములు వీరెంతమాత్రము వేయరు. తమరున్న స్థలములకు దూరముగ నేరములుచేయుటకు పోరు. వీరు గుడిసెలు తమగాడిదలపై తీసికొని పోదురు. వాటిపై వేయు గంతలలో దొంగ గుడ్డలు దాయుదురు.

వీరు ఉత్తరార్కాటు, దక్షిణార్కాటు, చెంగల్పట్టు, చిత్తూరు జిల్లాలలోను, నీలగిరిలోను నేరములు చేయుదురు.

వీరు పాముమంత్రములు బాగుగ నెరుగుదురు. మంత్రములు, మందులనుగురించి ఎక్కువగ ఎరిగియున్నట్లు నటింతురు. వీరు ఎడ్డిమనుష్యులు, శరీరదారుఢ్యము గలిగిన రూపరులు. చిన్నగుడ్డలు కట్టుటచే మగవారిని బాగుగ గుర్తించవచ్చును. ఆడవారు వ్యభిచారులు. వీరు సంతలలోను ఉత్సవ

ములలోను యిత్తడిమురుగులు పూసలపేరులు వేసుకొని బాగుగ దుస్తులు ధరించి ఇటునటు తిరుగుచు సోదెచెప్పుచు కనబడుదురు. అంచులుగల రంగుచీరెలు రెవికెలు ధరించె దరు. కుక్కలను పెంచుట వీరికిష్టము. వాటిపై తేలు, వేప చెట్టు, మొదలగు గుర్తులజూపు వాతలు వేయుదురు.

వీరు తెలుగు అరవము కూడ మాట్లాడుదురు.

వీరికి చెప్పతగినంత భూమి లేదు. ఏమియు పనిచేయక సోమరులై బిచ్చమెత్తియు, పందులనుపెంచియు జీవించునట్లు కనబడుదురు. వీరి ఆడవాండ్రు నాగస్వరము వాయించుటలో నేర్పరులగుటచే భిక్షాటనమునకు పోవునప్పుడు దానినికూడ తమతో తీసికొనిపోవుదురు.

వీరు దోపిడి, బందిపోటు మొదలగు నేరములు చేయు దురు. నేరములు చేయునప్పుడు దౌర్జన్యము చేయుదురు. వీరి పిల్లలు కళ్ళములలోని ధాన్యమును, పిల్లలైనప్పుడు బండ్లమీద కొనిపోవు ధాన్యపు బస్తాలకు కన్నములపొడిచి ఆధాన్యమును దొంగిలింతురు. వీరు దోపిడి, బందిపోటు నేరములు చేయు టకు తమ పెద్దవారితో పోరు.

వీరు నేరములుచేయ నుద్దేశించినపుడు సమీపమునం దుండు తమ జాతివారితో ఆలోచించుటకు నిర్జనస్థలమందుం డొక వేపమ్రానుక్రింద అందరును చేరుదురు. అప్పుడక్కడ పెరుమాళ్లస్వామిని గొలుతురు. పిమ్మట పది,పదిహేనుగురు

వరకు గుంపులుగ గూడి లావైన వెదురులాఠీలు తీసికొని తలకు గుడ్డచుట్టుకొని, మొలకు గోచిపెట్టుకొని బయలుదేరదురు. తాము దిగియున్న స్థలముదాటి కొంతదూరము బండ్లు పోవువరకు నాగి పిమ్మట ఆ బండ్లను ఇద్దరు లేక ముగ్గురు చొప్పున అడ్డగించి వాటిని త్రోవతప్పించి, తిరగత్రోసి వాటిలో ప్రయాణము చేయువారివద్దనున్న సొత్తంతయు దోచుకొందురు.

వీరు తమగుంపుపెద్ద చేతికి దొంగసొత్తు దాచనిత్తురు. తన గుడిసెవద్ద దానినాతడు దాచి తరువాత విక్రయించును. వీరు బసజేసియుండు స్థలసమీపగ్రామములలో పైకిగౌరవముగ గనపడు నూనెఅమ్మువారు, కల్లుఅంగడివారు గ్రామాధికారులును దొంగసొత్తు వీరివద్దనుండి కొనుదురు. వీరిపైని ఎంతనిగహాయుంచినను పుదుచ్చేరి మొదలగు స్థలములలో నుండు రిసీవర్ల సహాయముచే వీరు శిక్షతప్పించుకొనగలుగుచున్నారు. ఉత్తరార్కాటు, చెంగల్పట్టు జిల్లాలలోనుండు జోగివాండ్రు అనేకులు పుదుచ్చేరిలో నిప్పుడుదాగియున్నారు.

వీరి కులపెద్ద జంగమనబడును. కులతగవుల నాతడు తీర్చును. శకునములయందు వీరికి వెర్రినమ్మకము. పెళ్ళి కట్టుబాట్లు వీరిని బాధించవు. విధవలు స్వేచ్ఛగ పెండ్లియాడ వచ్చును. వయస్సుతో ప్రసక్తిలేకుండ పడుచులు తమకు తోచినప్పుడు పెండ్లియాడవచ్చును. మాలమాదిగలతో వీరు జేరరు. శూద్రులయిండ్లలో భుజింతురు. కొంతసొమ్ము

జుల్మానాగా పుచ్చుకొని విధవలను వ్యభిచరించనిత్తురుగాని వారిని పసుపునీళ్ళు పోసికొననివ్వరు.

---

## VIII ప్రకరణము.

# భట్రాజులు లేక భట్టుతురకలు.

---

వీరు చిత్తూరు జిల్లాలో చంద్రగిరి, పీలేరు డివిజనులలోనున్నారు. వీరు అలిగిరి సంతతివారు.

వీరు అతిపిరికివారగుటచే హానికరముగాని పనులు చేయుటయందుమాత్రము జాగరూకతకయు, ఓరిమియు గలవారు.

వీరు మామూలుగ బ్రాహ్మణులవలె నటించుచు, నిష్ఠగల బ్రాహ్మణులవద్ద చూడబడు రుద్రాక్షమాలలు. సాలిగ్రామములు, పంచపాత్ర, ఉద్ధరణి, తులసిమాలలు మొదలగు వస్తుసముదాయములు సంపాదించి వాటిని తమతో తీసికొనిపోదురు. జందెము వేసికొని, అన్ని తెగల బ్రాహ్మణులు చెప్పు మంత్రములు, లింగార్చన మొదలగునవి చెప్పుదురు. వీరిని తెలుగుబ్రాహ్మణులు చూచినమాత్రముననే బ్రాహ్మణులుకారని పోల్చగలుగుటచే వీరు దొంగతనములనెప్పుడు

అరవదేశమునందు చేయుదురు. వీరచ్చట తెలుగుదేశస్థులుగ జూడబడుదురు.

వీరు ఉత్సవములలోను, సత్రములలోను, రైలుస్టేష నులలోను, వంటపూటియిండ్లలోను, గృహస్థులయిండ్లలోను బ్రాహ్మణులవలెను, నౌకరులవలెను సులభముగ ప్రవేశించి దొంగతనముచేయుదురు. కొన్ని సమయముల వీరు తమ మూ టలు యితరుల మూటలతో కలిపియుంచి తమ మూటలకు బదు లుగ వారి మూటలు తీసికొని చల్లగ జారుదురు. కొన్ని సమ యములయందు వీరిలోనొకడు ఏదైన నొకపట్టణమున భాగ్య వంతునింట నౌకరుగజేరి ఆయన స్థితిగతులన్నియు బాగుగ తెలిసికొనును. పిమ్మట ఈ దొంగనౌకరునకు యింటివారి పరి చయము కలిగి అతనిపైవారికి మంచినమ్మకము గలుగువరకు మిగిలిన తనవారు ఆ పట్టణమునసేయుండి వానిసహాయమున దొంగతనముచేసి పారిపోదురు. కొంతకాలమైన పిదప ఈ దొంగ నౌకరుకూడ తనవారినిచూచు మిషపైని తనయజమానివద్ద సెలవుతీసికొని వెళ్ళిపోవును.

వీరు నేరములుచేయుటకు తమ యిండ్లనొదలి కడు దూరముపోయి, తిరిగి యిండ్లు చేరకమునుపే దొంగసొత్తు నమ్మి నగదుగ చేసికొందురు. వీరు మామూలుగ ముగ్గురు నల్గురుచొప్పున బయలుదేరిపోయి నెలలతరబడిని తమ యిండ్లకు రాకయుందురు. వీరిలో కొందరు వేరుగ చీలియు న్నప్పుడు తామొక మాదిరిగకుట్టి ఉపయోగించిన విస్తళ్ళ

ముందుగ నియమించుకున్న స్థలములయందుంచి తమవారికి తమ ఉనికిపట్లు తెల్పుదురు. అనుభవజ్ఞులు ఆ విస్తారాకులను గుర్తించి కొద్దికాలముక్రిందట నాచుట్టుపట్ల వీరు వచ్చియున్నట్లు తెలిసికొనగలరు. వీరు తమ గ్రామము జేరిన పిమ్మట దొంగసొత్తంతయు సమానముగ తమలో తాము పంచుకొని నేరములు చేసినవారికి రెండుభాగముల నిత్తురు.

ఈ భట్రాజులందరు దొంగలుకారు. కృష్ణాజిల్లాలో భట్రాజులుగల యొకగ్రామము కలదు. వారందరు వ్యవసాయదారులు. భట్రాజులలో దేశద్రిమ్మరులుమాత్రమే దొంగలు.

---

## IX ప్రకరణము.

# గూడుదాసర్లు.

---

వీరు పూర్వము ఉత్తరార్కాటుజిల్లాలో గొల్లకుప్పములో నివసించినట్లగపడును. వీరచ్చట పోలీసువారి నిగహా తప్పించుకొని దొంగతనములుచేయుచు దక్షిణార్కాటుజిల్లా పలకొలై గ్రామము చేరి ఆచుట్టుపట్ల గ్రామములలో తరుచుగ తిరుగుచుండిరి. వీరిప్పుడు దక్షిణార్కాటు, సేలము, కోయంబత్తూరు, తిరుచునాపల్లి, తంజావూరు, మధుర, చెంగల్పట్టు, జిల్లాలలోను, ఉత్తరసర్కారులలోను గలరు.

వీరు సామాన్యముగ గ్రామములకు దూరముననుండు చెర్వుప్రక్కలనుండు తోపులలోను, గ్రామములలోనుండు సత్రములలోను, చావిళ్ళలోనుగూడ నుందురు.

వీరు తమనుగురించి సమయోచితముగ చెప్పుకొందురు. సాధారణముగ దాసర్లమని (విష్ణుభక్తులమని) చెప్పుకొందురు. కాషాయవస్త్రములు, రుద్రాక్షలుధరించి పండారములమని గూడ నటింతురు. వీరు నెమలిపింఛములుగూడ తమతో తీసికొనిపోదురు. కాశీనుండిగంగ తెచ్చుచున్నట్లు నటించుచు నీరు నింపిన బుడ్డికొక పసుపుబట్టచుట్టి కాశీకావళ్ళు మోసికొని పోదురు. ఉత్తరహిందూస్థానమునుండి తీసికొనివచ్చినట్లు చెప్పుచు సాలిగ్రామములు, రుద్రాక్షలు విక్రయింతురు. బ్రాహ్మణులవలె కనబడుటకు జందెములు వేసికొందురు. వీరు కల్లుసారాయి విశేషముగ పుచ్చుకొందురు. వీరు తక్కువజాతివారితో జేరరు. సామాన్యముగ స్త్రీలు వ్యభిచారులు కారు.

వీరు తమభాషయైన తెలుగు, అరవము మాట్లాడుదురు. మరికొందరు హిందూస్తానిగూడ మాట్లాడుదురు.

వీరు బందిపోటు, దోపిడి. కన్నపుచోరీ, పశువులచోరీ, స్వల్పచోరీ, జేబుదొంగతనము మొదలగు నేరములు చేయుదురు. వీరెచ్చటనైన ఆగినప్పుడు అక్కడ చెడునడతగలవారిని పరిచయముచేసికొని వారినుండి సమాచారములు తెలిసికొని

వారికి కొంతసొమ్మునిత్తురు. వీరు యితరజాతివారితో నేర ములుచేయుట కెప్పుడును జేరరు.

వీరు మందనుండి తప్పిపోయి ఒంటిగ మేయు గొర్రెలనుపట్టుకొని అరవకుండ నాలుకలోముండ్లుగుచ్చి పగ లంతయువాటిని ప్రాణములతో నొకపొదచాటున దాతురు. ఆగొర్రెలకాపరి తనమందను తిరిగిదొడ్డికి చేర్చువరకు తప్పిపో యినగొర్రెలను కనుగొనలేడు. పిమ్మట ఆతప్పిపోయిన గొర్రె లకై వాడు వెదుకునుగాని దొరకవు. సూర్యాస్తమానమైన పిమ్మట ఈ గూడుదాసర్లు తాముదాచిన గొర్రెలను యింటికి గొనిపోదురు. వీరశవుల సమీపగ్రామములలో నిల్చినప్పుడు తప్పిపోయిన పశువులనుపట్టుకొని నట్టడవికిగొనిపోయి చంపి వానిని కల్లుసారాయి అంగళ్లలో విక్రయింతురు. మార్గస్తుడె వడైన వీరిని ప్రశ్నించిన వానికి కొంతమాంసము నిత్తురు. వీరి పాల్పడినవారు లోబడువరకు దౌర్జన్యము చేయుదురు. వీరిలోననేకులు బిచ్చమెత్తుకొను మిషపైని తమగుంపునుండి చెదరిపోయి పోలీసునిగహా తప్పించుకొందురు. ఆడవారిని వెనుకవిడిచి తిరిగిరాత్రులయందు వారినికలుసుకొందురు. వీరి భార్యాబిడ్డలు పోలీసు నిగహా తప్పించుకొనుటకై ఫ్రెంచిరాజ్య మునకు వెళ్ళుదురు. మగవారుకూడ అచ్చటికిపోదురు. పిమ్మట వీరందరుజేరి తమనెరుగని క్రొత్తస్థలములకు బయలుదేరుదురు. వీరిని పట్టుకొన్నప్పుడు ఎదుర్కొని మిగులదౌర్జన్యము చేయు దురు. ఉత్సవములలోను, సంతలలోను వీరిపిల్లలు జేబుదొంగ

తనములు నేర్పుగ చేయుటయే గాక కోళ్ళదొంగ తనము మొదలగు స్వల్పచోరీలుకూడ చేయుదురు.

వీరు నేరములుచేయునప్పుడు కత్తులు,లాఠీలు ఉపయోగింతురు. మరియొకవిధముగ వీరు నేరములుచేయలేనప్పుడు ఆయుధముల నుపయోగింతురు.

వీరి స్త్రీలు విలువగలచిన్ననగలను తమమర్మస్థానములలోదాచి అతిసులభముగ సోదాచేయుట కవకాశమునివ్వరు. వీరిలో కొందరాడవాండ్రు నగలు తమతొడపైనుంచి దానికొకదట్టమగు గుడ్డచుట్టి కురుపుచే బాధపడుచున్నట్టు నటించుచు సోదాచేయనివ్వరు. తరుచుగ రాళ్ళులేని బంగారపు నగలను కరిగింతురు. వీరు దొంగసొత్తు రహస్యప్రదేశముల భద్రపర్చి సొమ్ములేనప్పుడు దానిని వాడుదురు.

వీరు సాధారణముగ దొంగసొత్తు తమస్త్రీలచేతను, రిసీవర్లసహాయముచేతను విక్రయించుదురు. దొంగసొత్తుకొనువారికి కొంతలాభముండులాగున తక్కువధరలకే వీరు అమ్ముదురు.

భర్త జయిలులోనున్నప్పుడు లేక చిరకాలము దూరదేశముననున్నప్పుడు స్త్రీలు తమతెగవారితో వ్యభిచరింతురుగాని ఆ సంగతి వెల్లడైనపక్షమున ఆ స్త్రీకి కొంత జుల్మానా విధించి ఆ సొమ్ముపెట్టి వారందరుత్రాగుదురు.

వీరెక్కడున్నను వెంకటేశ్వరస్వామి వీరి కులదైవముగుటచే పెరటాసినెలలో (సెప్టెంబరునెలలో) ఆదైవమును

ఆరాధించుదురు. అంటురోగములు ప్రబలియున్న సమయముల కూడ ఆతని గొల్తురు.

---

X ప్రకరణము.

# వంగనూరు మాలవాండ్రు.

---

వీరు చిత్తూరుజిల్లా తిరుత్తని డివిజన్ యిలాకా వంగనూరు, చెంగలరాయుడుఖండిగ, కృష్ణకుప్పం, మాలపల్లెలలో నుండు మాలజాతిలో నొకశాఖ. ఈ గ్రామములలో వంగనూరు పెద్దదగుటచే నీమూడు గ్రామములలోనుండెడి మాలలకు వంగనూరు మాలలని పేరు వచ్చినది.

వీరు మాలపల్లెలో గుడిసెలుకట్టుకొని కాపురముందురు. వీరిలో కొందరికి కొంచెము భూవసతికూడ గలదు. వీరికి జీవనము గడపతగినంత భూమిలేదు. వీరు చిరకాలమునుండి ఏవిధమగుపని చేసియుండలేదు యిప్పుడును చేయుటలేదు.

వీరు చెంగల్పట్టు, ఉత్తరార్కాటు, చిత్తూరు జిల్లాలలోను నెల్లూరుజిల్లాలో కొన్నిప్రాంతములను, మైసూరురాజ్యములోని కోలారుజిల్లాలోను దొంగతనములు చేయుదురు.

వీరు మంచిశరీరదారుఢ్యముగల పొడుగైన మనుష్యులు

వీరు మాట్లాడునది అరవభాష. తెలుగు తెలియదు.

వీరు నివసించు గ్రామసమీపముల పనిచేసుకొని జీవించ తగినన్ని సదుపాయములున్నప్పటికి ఏవిధమగు కాయకష్టమును పడనోపక నేరములుచేసి జీవనముచేయుదుగు.

వీరు తరుచుగ రెడ్లవలెను ఇతరగొప్పజాతివారివలెను దుస్తులకట్టి తాముపోవు గ్రామములయందుండు సత్రములలోను యిండ్లలోను ఆగుచు నేరములుచేయతగిన యిండ్లనుగురించిన సమాచారములు పోగుచేయుదురు.

వీరు స్వల్పచోరీ మొదలు బందిపోటు నేరమువరకు ఆస్తితో సంబంధించు నేరములు చేయుదురు. మోసముచేయుటయు, నేరములుచేయకుండుటకు సొమ్ము వసూలు చేయుటయుగూడ గలదు. వీరి ఆడవారు, పిల్లలు ఏవిధమగు నేరములుచేయరు. మగవారిని పట్టుకొనుటకుగాని, యిండ్లుసోదా చేయుటకుగాని పోలీసువారు తమ మాలపల్లెలకు వచ్చినప్పుడు అడవారు వారిని ఆటంకపర్చుటలో మగవారికి సహాయులగుదురు. పదహారు సంవత్సరములకు తక్కువ వయస్సుగలవారు గొప్పనేరములు చేయక స్వల్పచోరీలుమాత్రమే చేయుదురు. ఆడవారు వ్యభిచారులుకాకపోయినను చాలాభాగము నేరములలో వీరికి సహాయులయినవారితో వ్యభిచరించినట్లు అనుమానింపబడిరి. వీరు తమ మగవారు పట్టుబడినప్పుడు నేరములనుండి వారిని తప్పించుటకు తగిన ఏర్పాటులు చేయుదురు.

వీరు తమభార్యాబిడ్డలను యిండ్లవద్ద నొదిలి పది, పది హేనురోజులవరకు నేరములుచేయుటకు పోవుదురు. కన్నపు చోరీలుచేయుటలో వీరెక్కువ తెలివితేటలుగలవారు. సాధారణముగ యిండ్లలోపల ప్రవేశించుటకు ఒకకిటికీని పూర్తిగ తీసివేయుదురు. వీరు దొంగసొత్తుపట్టుకొని రైలుప్రయాణములు తరుచు చేయుదురు. కొన్నిసమయముల జట్కాబండ్లపైగూడ పోవుదురు. వీరు నేరములుచేయునప్పుడు ఆడవారిని చెరచునట్లుగూడ చెప్పుదురుగాని, స్వస్థచేతకాబోలు ఆ సంగతులు వెల్లడికాలేదు.

సాధారణముగ దొంగసొత్తు ఒకటి, రెండు సంవత్సరములవరకు కూడ అమ్మకపోవుటచే వీరు చేసిననేరములు కనిపెట్టి పట్టుకొనుటకు బహుదుస్తరము. దొంగసొత్తు వంగనూరు చుట్టుప్రక్కలనుండు కొండలలో దాయుదురు.

---

## XI ప్రకరణము.

# వేపూరిమాలవాండ్రు

---

వీరు సంకు, పనైక్ష మాలతెగవారు, దక్షిణార్కాటు జిల్లాలో పేరుబడ్డ గజదొంగలు. వీరు వృద్ధాచలమునకు పడమరవైపున విశేషముగ నున్నారు. వేపూరు అను గ్రామము

నుండి వీరికీపేరు వచ్చినది. వీరిని నిగహాలో నుంచుటకొక పోలీసుస్టేషను అచ్చటనున్నది.

వీరు గ్రామముల బయిట మాలపల్లెలలో నివసింతురు. సాధారణముగ వీరు అక్కడ నిలకడగ నివసించుచు నేరములు చేయుటకు మాత్రము చుట్టుప్రక్కల గ్రామములకు తంజావూరు, తిరుచునాపల్లి, సేలము, ఉత్తరార్కాటు జిల్లాలకు పోదురుగాని తరుచుగ కొన్ని ముఖ్యప్రదేశములయందు మాత్రమే వీరు నేరములు చేయుచుందురు.

వీరు మామూలు మాలవాండ్రతో సంబంధమును చేసికొనక, వారికంటె శుచిగనుండి, మంచిబట్టలగట్టి యిండ్లు వాకిళ్ళు కలిగియుండుటచేతను, వారివలె స్వాభావిక మరణ మొందిన జంతువులమాంసము తినకపోవుటచేతను, వారికంటె ఎక్కువ జాతివారుగ గనపడుదురు. వీరిలో చాలామంది విశేషముగ త్రాగుదురు.

వీరికి వ్యవసాయము పైకగపడు వృత్తి. కొన్ని యకరముల మెట్టభూమి వీరికుండునుగాని దానినుండి వీరి కుటుంబభరణము జరుగదు. నేరములుచేయుటకు పనికివచ్చు సమాచారములు పోగుచేయ వీలున్నప్పుడుతప్ప యితరసమయముల వీరుకూలిపనినైన చేయరు.

వీరు నేరములుచేయ వెళ్ళునప్పుడు హిందువులవలెను, తరుచుగ బ్రాహ్మణులవలెను బట్టలకట్టి మారువేషములు వేయుదురు. పశువుల వర్తకులుగ నటించుచు సత్రములలో

నికి, తిండిపెట్టు యితరస్థలములలోనికి సులభముగ ప్రవేశింతురు.

వీరు కన్నపుచోరీ, చోరీలు తరుచుగ బందిపోటు నేరములుచేసి తమ జీవనము గడుపుకొందురు. పశువులను, గొర్రెలను దొంగిలించుటలోగూడ గట్టివారు. కన్నపుచోరీ చేయుటయే వీరి ముఖ్యవృత్తియగుటచే దానిని చేయుటలో పేరు పొందిన మొనగాండ్రు.

ఈ క్రింద చెప్పబోవు మూడు విధములుగ వీరు కన్నపుచోరీ చేయుదురు.

i గోడకును పైకప్పు చూరునకును మధ్యగల స్థలము విశాలముగ చేయుటవల్లను ;

ii తలుపు గడియవద్ద నొకమనిషి చేయిదూరునంత పెద్ద కన్నము త్రవ్వుటవల్లను ;

iii ఒక చిన్నపిల్లవాడు దూరతగినంత కన్నము గడప క్రింద త్రవ్వుటవల్లను ;

వీటిలో మూడవది వీరికిష్టమగు పద్ధతి.

వీరు వానకురియు చీకటిరాత్రులు చూచుకొని తమ మకాములకు నలువైపుల 30 మైళ్ళ లోపలనుండు ప్రదేశములకు గుంపుగపోదురు. మామూలుగ గుంపునకు ఆరుగురుందురు. ఇంటిలోనికి పోవ మార్గమేర్పరుచుకొన్నపిదప బయి

టకు స్వేచ్ఛగ వచ్చుటకుగూడ మార్గముచేసికొని యిద్దరు లోనికి పోవుదురు. ఇతరులు దొంగసొత్తు (ఇత్తడి బిందెలు బట్టలు, నగలు వగయిరాలుగల పెట్టెలు మొదలగునవి)అందు కొనుటకు బైట దాగియుందురు. లోపలివారు దొంగిలించు వస్తువుల నన్నిటిని అతివేగముగ బైటనున్న తమవారికి అంద జేయుదురు. వీరు తరుచుగ పరుండియుండిన స్త్రీలయొక్కయు, పిల్లలయొక్కయు శరీరములపైనుండు నగలు తీయుదురు. ఆరి తేరిన దొంగగా నెంచబడినప్పుడుమాత్రమే మిట్టిపనిని తలపె ట్టును.

వీరు దాదాపు పదునెనిమిది యంగుళముల పొడవు గలిగి నాగలికర్రువలె కనపడు 'అరసకుచ్చి' అని పిలువబడు పనిముట్టు నుపయోగింతురు.

వీరివద్ద దక్షిణార్కాటు, తిరుచునాపల్లి, సేలం జిల్లాల లోని గ్రామములలోనుండు రెడ్డి, మాలమూరు కులస్తులు దొంగసొత్తుకొని వీరినాదరింతురు. వీరిచే తమ విరోధులపై గల కార్పణ్యము తీర్చికొందురు. వీరిలో నెవరికైన నాపద తటస్థించిన మాలమూరులు వానికి వకీలు కుదిర్చి ఆకేసునకగు సొమ్మంతయు నిత్తురు. మాలమూరి ఆడవాండ్రు వీరికికావలసిన గింజగిట్రలకు ముందుగ సొమ్మిచ్చి తిరిగి వీరినుండి దొంగసొత్తు పుచ్చుకొనుచు నెక్కువగ వీరితో వ్యవహరింతురు. చోరీ వల్ల ఆస్తి పోగొట్టుకొన్నవారు వీరికి నాల్గవవంతు వెల తుప్పు కూలిగ జాడచెప్పుటకునిచ్చి వీరి వద్దనుండి తమసొత్తు తిరిగి రాబట్టుకొందురు.

ఈ వేపూరిమాలవాండ్రు గూడ నేరములుచేయు యితరతెగవారివలెనె శకునములు పాటించెదరు. దుశ్శకునములు వచ్చిన కొంతకాలము నేరములుచేయుటకు పోవుట మానుదురు.

వీరు వివాహబంధము చుల్కనగ జూతురు. ప్రతి కుటుంబమునకు ఒక్కొక్క యిష్టదేవత యున్నను వీరిలో చాలామంది మంజప్పస్వామియొక్క భక్తులు. తరుచుగ వీరు తమపెద్దలను నాయకులుగ చూచుటచే వారు కులపంచాయితులు, కులపండుగలు మొదలగువాటిలో నధ్యక్షత వహింతురు.

వీరిగురువులగు తాతమాలలు వీరినుండి పన్నులుమొదలగునవి వసూలుచేయుదురు. వీరిని కులమునుండి వెలివేయగల యధికారముకూడ వారికి గలదు.

---

## XII ప్రకరణము.

# కేపుమారీలు

వీరిని తోగమల్లి కొరవవాండ్రనియు, అలిగిరులనియు, ఈనకొరవలనియుగూడ బిలుతురు. వీరి రక్తస్పర్శగల బంధువులు ముఖ్యముగ దక్షిణార్కాటు జిల్లాలోని మారియకుప్పములోను, చెంగల్పట్టుజిల్లాలోని వెంబాకంపేటలోను, కడప జిల్లాలోని బుగ్గలైతపల్లిలోను, మైసూరురాజ్యములోని మా

లూరులోను, నిజాంరాజ్యములోని శ్రీరంగాపురములోను యున్నారు. తిరుచునాపల్లి జిల్లా, తోగమలై పోలీసుస్టేషనుకు తూర్పుగ రెండుమైళ్ళ దూరమందున్న ఇడియపట్టి గ్రామము ముఖ్యముగ వీరుండు స్థలము.

వీరు రైలుపై స్వేచ్ఛగ ప్రయాణములు జేయుదురు. పోస్టాఫీసులనుగూడ నుపయోగించుకొందురు. వీలుచిక్కినప్పుడెల్ల ఈ రాజధానియందన్నిచోట్ల జరుగు ఉత్సవములు మొదలగువాటిలోను, పట్టణములలోను, నేరములుచేయుటకు రైలుపైపోదురు.

కొన్నిసమయముల వీరొక పెద్దగుంపుగ ప్రయాణముచేయ నిశ్చయించుకొన్నప్పుడు, ముందుగనే తాము కలుసుకొనుటకొక చోటువేర్పర్చుకొని చిన్నచిన్న గుంపులుగ తమ స్థలమునొదలి వేర్వేరు స్టేషనులలో రైలెక్కుదురు. వీరికి ప్రతిదినము కావలసినబియ్యము మొదలగునవి ఒకముతకసంచిలో పోసికొని తీసికొనిపోవుచు ఒకపట్టణమునకు ఒకటి, రెండు మైళ్ళదూరమందుండు ఒకతోటలోగాని మరుగుప్రదేశములోగాని నిలుతురు. పిమ్మట నేరములు చేయుటకు చిన్నగుంపులుగ విడిపోయి ఆపట్టణమన్నివైపుల తిరిగి తమ మకాములకువచ్చి చేరుదురు.

వీరు కన్యాకుమారీఅగ్రము (కేప్ కామరిన్) మొదలు ఉత్తరసర్కారులవరకు నేరములుచేయ తిరుగుచుందురు. ఈ రాజధానియందంతటను వీరు శిక్షలుపొందినట్లు కనిపెట్టబడినది.

వీరు తిరుచునాపల్లి జిల్లాలో నేరములరుదుగ చేయుచురుగాని కులిత్తలై డివిజనులో నేరములుచేసినట్లు కనపడదు.

వీరు యిండ్లవద్దనున్నప్పుడు చెన్నపట్నం మొదల్యారులవలె కనబడుదురు. సాదా తెల్లబట్టకట్టుదురు. వీరిలో ననేకులు తలవెంట్రుకలు కత్తిరించుకొందురు. సాధారణముగ అయిదు అడుగులు మొదలు అయిదడుగుల ఏడంగుళములవరకు ఎత్తుగల బలాఢ్యులు. వీరిస్త్రీలు రూపసులు, బలాఢ్యులును, చూచుటకు మర్యాదస్తులవలె కనపడుదురు. వీరు బాగుగ దుస్తులధరించి అవసరమువచ్చినప్పుడు తమ చుట్టుప్రక్కల నుండువారితో సమయోచితముగ మాట్లాడ నేర్పుగలిగి, గొప్ప ఉత్సవములకు వచ్చుస్త్రీలతో కలిసిమాట్లాడుచు వారికెవ్విధమగు సంశయము కలుగనీయకుండ దొంగతనములు చేయుచున్నారు. వీరికి నుదుటను, మోచేతిపైనను, గుండ్రముగగాని చంద్రవంకవలెగాని పచ్చపొడిచియుండును. ఉత్సవదినములలో నుదుటనుండు పచ్చపై కుంకుమపెట్టుకొందురు. వీరుబండల్ ఖండులోనుండు సునీరియాలను, పునాలోనున్న భంప్తాలను పోలియుందురు.

వీరిభాష అరవము. ఇప్పుడు వీరిలో కొందరు తెలుగు మళయాళ, కన్నడ, హిందుస్తాని దేశములలో తిరుగుటచే ఆభాషలగూడ మాట్లాడుదురు. పుదుచ్చేరీలోనున్న వారు ఫ్రెంచి భాష మాట్లాడగలరు. వీరిలో పురుషులందరికిని స్త్రీలలో కొందరికిని చదువుట, వ్రాయుట, తెలియును.

వీరు వ్యవసాయముచే జీవించునట్లు తెలియుటకై తమ పేరట కొన్ని భూములు కొనుక్కొని సర్కారుపన్నులు చెల్లించుచున్నారు.

వీరు విశేషముగ మారువేషములు వేయుదురు. తోగమల్లి కొరవలెప్పుడును నిజమగు పేరుగాని చిరునామాగాని చెప్పరు. ఇతరులు పోల్చవీలులేనట్లుగ యాత్రలుచేయు కోమట్లవలెను, గొప్ప మిరాశీదారులవలెను, కాకితముల కట్ట, కలము, పెన్సలు, పట్టుకొని ప్లీడరు గుమాస్తాల వలెను, అద్దెలు వసూలుచేయ నియమింపబడిన ఏజెంట్లవలెను, చిల్లరసామానులు విక్రయించువారివలెను, కల్లు సారాయి యిజారాదార్లవలెను వీరు వేషములు వేయుదురు.

వీరు కన్నగాండ్రు, జేబుదొంగలు, పేరుపడిన దొంగలు. వీరు దగానాణెములు చేయుటలోగూడ సమర్థులే. దూరమునుండి సైగలుచేయుచు తరుచుగ స్త్రీలచేతను, పిల్లలచేతను వీరు స్వల్పనేరములు చేయించుదురు.

ఏడేండ్ల లేతప్రాయముగల పిల్లలను తమకులవృత్తిలో ప్రవీణులగునట్లు తరిఫీయతు చేయుదురు. వీరి దొంగతనము పట్టుబడిన ఎకరరు పడవద్దనియును, తమ నిజమైన పేరుల నెప్పుడు చెప్పవద్దనియును వీరికి బోధింతురు. ఇంట్లో వీరి తండ్రి తనప్రక్కను బట్టలమూటనొకటి నుంచుకొని తనకు తెలియకుండ వాటిని దొంగిలించుట మొదటనేర్పును. పిమ్మట ఈ పిల్లలు దొంగిలించుట తమలోతామొక యాటగ నభ్యసించుదురు.

వీరికి సంజ్ఞలుకూడ నేర్పుదురు. ముక్కుపైన వ్రేలుంచిన 'ముందుకుపో' అన్నమాట. కుడిమీసముగాని ఎడమమీస ముగాని త్రిప్పిన మార్గము సూచించును. వ్రేలితో గడ్డము పట్టుకొన్న 'తీసికొనిపో' అన్నమాట. వీరికొక చిన్నకత్తి గూడ నిత్తురు. దానిని నోటిలో దాతురు. తండ్రిమాట వినని పిల్లలను కర్రతో కొట్టుదురు లేక కండ్లలో మిరియముల నూరి పెట్టుదురు. పిల్లలు తమ తండ్రులకు, పెద్దలకు సహాయముగ నుండి వారు ఇతరులతో మాట్లాడుచున్నప్పుడు దొంగతనము చేయుదురు. పిల్లలచే దొంగతనముచేయించుటచే వీరికి గలుగు లాభములు రెండు. వారు దొంగతనము చేయుటలో నలవాటు పడుటయొకటి, పట్టుబడినప్పుడు పిల్లలగుటచే దెబ్బలుతిని తప్పించుకొనగలుగుట మరొకటి.

సాధారణముగ ఇద్దరుమనుష్యులు ఒకస్త్రీని, ఒకరిద్దరు పిల్లలను, తమతో తీసికొని యాత్రస్థలములకుగాని, విశేషజన సమూహముండు ఉత్సవములకుగాని పోదురు. వీరిలోనొకడు మర్యాదస్తునివలె బట్టలుకట్టి తాను దొంగిలించతగినవారికై వెదకుచుండును. అట్టివారెవరైన కనబడి, మంచివీలుచిక్కిన రెండవవానికి సంజ్ఞలచేయును. అప్పుడాతడువచ్చి వెంటనే దొంగిలించి దొంగసొత్తు ఆడదానిచేతికిచ్చును. మర్యాదస్తుని వలె నటించువాడు సొత్తు పోగొట్టుకొనినవారితోనుండి వారి నోదార్చుచు పోయినసొత్తు రాబట్టుకొన వారు ప్రయత్నించునపుడు వారిని తప్పుత్రోవలో పెట్ట జూచును. నగలున్న పిల్లలు కనబడిన తమగుంపుపిల్లలను వారితో కలసియాడుటకు

పంప వారు ఆ పిల్లల నగలు అతివేగముగ పెరికి తమప్రక్కను కాచియుండు వీరికి వెంటనే అందజేతురు. వీరొకస్త్రీవద్దనుండుసొత్తు దొంగిలించదలచిన సాధారణముగ వీరి ఆడమనిషి యొకతె నేరముచేసి దొంగసొత్తు తనగుంపులో నొకమగవాని కప్పగించును. విశేష జనసమూహాములు గలచోట్ల నేరములు చేసిన తాము పట్టుబడకుండ తప్పించుకొనవచ్చుననియు, అట్టి యాత్రస్థలములకు దూరదేశములనుండి జనులు వచ్చియుండుటచే పోలీసువారితో వారు పోగొట్టుకొనిన సొత్తునుగురించి మొరపెట్టుకొనరనియు, ఎరిగియుండుటచే వీరిట్టినేరములు చేయుటయందే మిక్కిలి ఇష్టము.

వీరు రైలుగల ప్రదేశములలో విశేషధనసంపాదనచేయగలుగుదురు. ప్రతిగుంపునకు ఒక్కొక్క నియామక ప్రదేశముండును. నేరములుచేయు యితరగుంపులవారు పోవుచోట్లకు వీరు వెళ్లుటయరుదుగాని వారి యనుమతిపొంది ఒకప్పుడు వెళ్లుచుందురు. స్త్రీలను, పిల్లలను తీసికొని నలుగురైదుగురొకగుంపుగగూడి రైలులో వేర్వేరుగదులయందు ప్రవేశించి బాటసారుల నుల్లాసపర్చుటయందు మిగులసమర్థులగుటచే తమతోగూడ ప్రయాణము చేయువారెక్కడికి ఎందునిమిత్తము పోవునది వేగమే తెలిసికొందురు. వారు అమాయకముగ వీరిని దొంగలుగ నెంతమాత్రము సంశయింపక ఆదమరచి నిద్రపోవునపుడు వారి నగలు వెలగల నితర వస్తువులు దొంగిలింతురు. పిమ్మట వీరు ఆ దొంగసొత్తుతో ప్రక్కస్టేషనులోదిగి, తాముముందుగ నేర్పర్చుకొన్న స్థలము

లోనందరు కలిసికొని పట్టుబడకుండ నేరము చేసినవానికి రెండువంతులిచ్చి మిగిలినది వంతులప్రకారము తాము సమముగ పంచుకొందురు. మామూలుగ ఉత్సవసమయములలో స్త్రీలు నగనాణ్యములు విశేషముగ ధరించి రాత్రులనడుచు రైళ్ళలో ప్రయాణముచేయుట వీరు కనిపెట్టుటచేత యాత్రస్థులయొక్కయు ఇతరులయొక్కయు సౌకర్యముకొరకు రాత్రుల నడుచు స్పెషల్ రైళ్ళలో వీరెల్లప్పుడు నుందురు. వీరు దొంగిలించుచుండగ పట్టుబడిన విశేష దౌర్జన్యము చేయుదురు. వీరిపిల్లలు ముఖ్యముగ రాగినాణెములకు పాదరసము పూసి వెండినాణెములని మార్చుటలో నేర్పరులు.

బ్లెడువలెనుండు ఒక చిన్నకత్తి వీరివద్ద నెల్లప్పుడుండును. దానిని నోటిలోదాచుకొని బాటసారుల రైలుసంచుల దారములు, స్త్రీలు, పిల్లలు ధరించు నగలదారములు కోయుదురు. వీరు తమసంచులలో పగిలిన గ్లాసుముక్కలు, ఒక కత్తెర, ఒకయినుపమేకు, రెండుమూడురూపాయలు ఒకడగ్గి పెట్టెగూడ వేసికొని తీసికొనిపోదురు.

వీరు దొంగసొత్తు దాయుచోటు పోలీసువారికి ఆచోకి దొరకకుండుటకు ఎంతమాత్రము శుభ్రముగనుంచరు. స్త్రీలు తమ మర్మప్రదేశములలో దొంగనగల దాతురు.

ఇడియపట్టికి చుట్టునుండు గ్రామములలోని పలుకుబడిగలవారు వీరి రక్షకుల్లు. ముందేర్పర్చుకొన్న ఒక చెట్టు మొదటగాని ఆనవాలుంచుకొన్న స్థలసమీపమునగాని శీఘ్ర

ముగ తీసికొని పోలీలగులాగున వీరు పాతిపెట్టి యుంచు దొంగసొత్తు పుచ్చుకొనుటకు ఈ రిసీవర్లు వీరిని ప్రయాణము లలో వెంబడించుదురు. ఈ రిసీవర్లుమాత్రమేగాక వీరికి తిరుచునాపల్లి, మధుర, తిరునల్వేలిలోను, అరవజిల్లాలలోని మరికొన్ని పట్నములలోను కూడ మరికొందరు గలరు. వీరు చిన్న గుంపులుగ ప్రయాణముచేయునప్పుడు ఆ రిసీవర్ల సహాయము నొందుచు వారికడ నిలుతురు.

వీరు నేరములలో పట్టుబడినప్పుడు తమ గుంపువారి నెప్పుడు జేర్చరు. ఈ తెగవారందరు జైలులోనున్నవారి భార్యాబిడ్డలను పోషింతురు.

వీరు ముఖ్యదైవములుగ నెంచు కాళీయమ్మనుకు, కరుప్పనుకు, మధురవీరన్నకు ముడుపులు కట్టుకురు. శకునముల యందు వీరికెక్కువ నమ్మకము. వీరు నేరముచేయ బయలుదేరు నప్పుడును, పోవలసినస్థలము చేరకమునుపును, ఏదైన నొక దుశ్శకునమైన ఆ ప్రయాణము మానివేయుదురు. కాకులు, నల్లని పక్షులు ఎగురుటయు పాముకనబడుటయు వీరు పాటించు శకునములు. దారికడ్డముగ కుడినుండెడమకు కాకియు, ఎడమ నుండికుడికి నల్లనిపక్షు లెగురుటయు, దారిలో నేదైన పాముండుటయు వీరికి అపశకునములు.

వీరి తెగలో వివాహనిర్బంధములు లేవు. స్త్రీలు వ్యభిచారులైనను పైవారి కెంతమాత్రము లోబడరు. విధవ

వివాహమాడవచ్చును గాని చనిపోయిన తనభర్తతమ్ముని పెండ్లియాడుట వీరియాచారము.

వీరు మధురవీరన్నను, కరుప్పనును పూజించుచు వారికి కోళ్లను బలియిత్తురు. ఆ గుళ్ళముందరనుండు జండాలపై కోడిరూపముండును. అందుచేత కొరవవాడెప్పుడును కోడిని తినడు. ఒకవేళ తినిన వానికి తలనొప్పి వచ్చును. దేవతల యుత్సవములకు ఈ గుంపువారందరును సొమ్ము నియ్యవలయును. ఆప్రకారమియ్యనివారిని వెలివేయుదురు. వీరు కొంత దొంగసొత్తుకూడ నా యుత్సవములకై విడిగ దాచియుందురు. తోగమల్లెలోనున్న దేవాలయము సుబ్రహ్మణ్యస్వామిది. ఆ స్వామికి ప్రతిసంవత్సరము ఉత్సవములు చేయుదురు. అప్పుడు వీరెవరును దొంగతనము చేయకూడదు.

---

## XIII ప్రకరణము.

# కళ్లరు.

---

వీరు ఈ రాజధానిలోని తంజావూరు, తిరుచునాపల్లి, మధుర, రామనాడ్, తిరునల్వేలి జిల్లాలలో నేరములుచేయు ముఖ్యనేరస్థులు. వీరు మధుర, తిరుచునాపల్లి జిల్లాలలో మిగుల పేరుపడిన దొంగలు.

వీరు పైచూపునకుగాని, దుస్తులు ధరించుటయందుగాని శ్రద్ధగలవారుగ కనపడరు. వీరిలో మగవారికి మొలకొక్క మూతక తెల్లగుడ్డయు, పైకొక్క మూతకయంగవస్త్రము, ఒక యఱ్ఱచేతిరుమాలు యుండును. వీరు చొక్కాలు తరుచుగ తొడగరు. వీరి స్త్రీలుగూడ వస్త్రములు బాగుగ ధరించరు. ఒక మూతక తెల్లచీరెమాత్రము కట్టుకొందురు. రవికె తొడగనే తొడగరు. స్త్రీపురుషులందరు తమ చెవితమ్మెలు బాగుగ క్రిందికి సాగతీసికొనుటచే నవి భుజములపై వ్రేలాడుచు కనబడును.

వీరిదివరకు పోనట్టియు తమను దొంగలుగ జనులు తెలిసికొనలేనట్టియు చుట్టుప్రక్కల జిల్లాలలో నేరములుచేయుటకు రైలు ప్రయాణములు చేయుదురు. పోలీసు యుద్యోగస్థుడుగాని ఒక గ్రామస్థుడుగాని వీరినిచూచి ప్రశ్నించిన తాము పశువుల వర్తకులనియు, పశువుల సంతలనన్నిటిని చూడబోవుచున్నట్టును చెప్పుకొందురు.

వీరు మారువేషములు వేయరు. వీరొకరికొకరు భూమిపై కొక్కిరిగీతలు గీసియు, ఈలవేసియు సైగలుచేసికొందురు. నేరములుచేయునప్పుడు పేర్లబిలుచుకొనక "పెద్దవాడు" "చిన్నవాడు" అని సందిగ్ధపదముల బిలుచుకొందురు. ఇరుగుపొరుగువారి సొత్తునపహరించి జీవించునట్లు వీరు తమపిల్లలకు నేర్పుదురు.

వీరు రాజమార్గములపైని యిండ్లలోను బందిపోటు దోపిడి, కన్నపుచోరీ, పశువులచోరీ మొదలగు నేరములు

చేయుదురు. ఈ నేరములన్నియు చేయుటలో వీరు మిగుల ప్రవీణులు. కన్నపుచోరీ చేయునప్పుడు గడపక్రింద కన్నము త్రవ్వి పిల్లవాడొకడు దానిగుండ దూరి లోనికిపోయి తలుపుతీయ పెద్దవాండ్రు లోపలప్రవేశించి మిగత వ్యవహారమంతయు తామే జక్కపర్చుకొందురు. నిద్రపోవువారి ఒంటనుండెడి నగలు తరుచు తీయరు. వీరు విశేషముగ పశువులచోరీ చేయుదురు. వాటిని గుర్తించవీలు లేకుండునట్లు కొమ్ములు కోసివేతురు. చెవులు, తోకలు కోసివేతురు. కొన్ని క్రొత్తనాతలు వేతురు. పిమ్మట వాటిని యడవులలోనికి దోలుకొనిపోయి కొన్ని దినములుంతురు. అప్పుడు వీరిస్నేహితులు కొంత 'తుప్పు కూలి'నిచ్చి వీరివద్దనుండి తిరిగివాటిని తోలుకొనిపోదురు. ఒకప్పుడు సంతలలో విక్రయింతురు. సిలోను పంపుటకు ఓడపై నెక్కించుటకు తూత్తుగుడి (ట్యూటికరిన్) తోలుకొనిపోదురు.

వీరు మామూలుగ దుడ్డుకర్రలు, అప్పుడప్పుడు పడమటి సముద్రతీరవాసులు ఉపయోగించుకత్తులుమాదిరి కత్తులు తీసికొనిపోదురు. వడిసెలలు, కన్నపుకోలలుగూడ వీరివద్దనుండును.

వీరిస్త్రీలు తరుచుగ నేరములుచేయరుగాని దొంగసొత్తు విక్రయించుటలో తమ మగవారికి సహాయపడుదురు. దొంగసొత్తు జలదారులలోను, గడ్డివాములలోను, నూతులలోను దాచి స్వంతదారు జాడచెప్పుటకు సొమ్ముయిచ్చినయెడల వానిసొత్తును తిరిగి యిచ్చివేయుదురు.

వీరికి నాటకోటిచెట్లు ముఖ్యరిసీవర్లు. బట్టలు మొదలగు స్వల్పవస్తువులు విక్రయించుటలో కల్లు సారాయి అంగడివారు వీరికిసాహాయులు. గొప్ప నేరములలోని ఆస్తి చెడగొట్టకుం డను, పంచుకొనకుండను నెలలతరబడిని జాగ్రత్తపఱ్చుదురు.

వీరికి ఎడ్ల పందెములయందాసక్తి మెండు. బాగుగపోట్లాడు టకై చిన్ననాటనుండియు గిత్తలను తయారుచేసి ఏటేట ఒక పర్యాయము వాటి కొమ్ములకు కొంతసొమ్ముగాని నగలుకట్టి వాటిని పందెములకు సిద్ధపర్చియుంచుదురు. ఈచోద్యముచూచు టకు చుట్టుప్రక్కలగ్రామములనుండి విశేషజనము వత్తురు. కర్ణ కఠోరముగ డప్పులుమొదలగు వాద్యములు వాయించుచుం దురు. అప్పుడాపోతరించియుండు గిత్తలను స్వేచ్ఛగ వదులుదురు. ఈజనసమూహామునకు వాద్యధ్వనులకు నవి మిగుల భీతినొంది ఒళ్లుమరచి పట్టశక్యముగాకుండ పరుగెత్తుచుండును. అప్పుడు వీరిలోనొక్కొక్కడు ఒక్కొక్కగిత్తవెనుక దానికొమ్ములకు కట్టిన సొమ్ముివిప్పుకొనుటకు పరుగెత్తుచు వెంబడించును. ఈ వేడుక మధుర, మేలూరు, తిరుమంగలము తాలూకాలలో నెక్కువగ జర్గును. దీనినే దక్షిణ దేశమందు జెల్లికుట్టందురు.

వీరు బాల్యవివాహములు చేయరు. మారుమనువు కలదు. వీరిలో భార్యాభర్తలు ఒకరినొకరు నిరాటంకముగ విడిచిపెట్టవచ్చును. పెక్కండ్రుకళ్లర్లు సున్నతి చేయించుకొం దురు. ఆ యాచారము తమతెగవారికి చిరకాలమునుండి యున్నట్లు చెప్పుదురు. వీరికులపెద్దను అంబలాకరందురు.

వీరుచేయు నేరములకు భయపడి పెక్కుమంది ధనవంతులు వీరిని కావలివాండ్రుగ తమ యింటివద్ద పెట్టుకొందురు.

---

XIV ప్రకరణము.

# మరవర్లు

---

వీరు మధుర, రామనాడ్, తిరునల్వేలి, జిల్లాలలో నున్నారు. వీరొక శతాబ్దముక్రిందట మిగుల దుర్మార్గముగను, అల్లరిగను, యుండి గవర్నమెంటువారికి విశేష తొందర నిచ్చిరి. ఇప్పుడు చాలామట్టుకు వీరు కుదుటబడి నెమ్మదిగ నున్నను, యిప్పటికిని వీరిరుగుపొరుగువారికంటె వీరెక్కువ ధైర్యస్థైర్యములు కలిగియున్నారు.

వీరు చాలభాగము నిలకడబడినారుగాని కొందరు మాత్రము జీవనము గడువకపోవుటచే తంజావూరు, తిరుచునాపల్లి, కోయంబత్తూరు జిల్లాలకు వలసబోయి భూస్వాములయొద్ద నౌకరులుగ ప్రవేశించినారు. తంజావూరు, తిరునల్వేలి జిల్లాలలో విశేషముగ వీరిని కావలిగార్లగ నియమించిరి.

వీరి తలవెంట్రుకలు మిగుల పొడుగుగా నుండును. స్త్రీపురుషులందరు చెవులకు బరువగు నగలు పెట్టుకొని

కొన్ని యంగుళములవరకు చెవితమ్మిలను సాగదీసికొందురు. కొన్ని సమయముల స్త్రీలు వారిచెవులు భుజములపై పడునంత పొడుగుగగూడ సాగదీసికొందురు. పురుషులు తలగుడ్డలు పెట్టుకొనక ఒకగుడ్డ తమ తలకు చుట్టుకొందురు. వీరు శరీర దారుఢ్యముఁగలిగి పొడుగుగనుందురు. వీరందరును సారాయి త్రాగుదురు. పొగాకు నమలుదురు. మరియు చాలామంది నల్లమందుఁగూడ వేతురు. జూదమాడి కాలయాపన చేయుదురు. నేరములనుచేయునప్పుడు మారువేషములు వేయరు. వీరిని గుర్తించగలిగిన గ్రామములలో బందిపోటు నేరములు చేయునప్పుడుమాత్రము ముఖమునకు సున్నముగాని మసిగాని పూసికొందురు.

వీరు ముఖ్యముగ బందిపోటు, దోపిడి, కన్నపుచోరీ, పశువులచోరీ చేయుదురు. ఆడవారు స్వయముగ పశువుల చోరీలు చేయుదురు.

వీరిస్త్రీలు దొంగసొత్తు బుట్టలలో పెట్టుకొనిపోయి గ్రామములోనుండు కోమట్లకు అమ్మొటకు మగవారికి సాధారణముగ సాహాయపడుచుందురు. నాటకోటిచెట్లుగూడ వీరి వద్ద దొంగసొత్తు కొందురు.

అలగిరిస్వామి వీరిముఖ్యదైవము. వీరా దేవాలయపు పెద్దను తమ మతగురువుగను, యజమానిగను యంగీకరింతురు.

వీరి సాంప్రదాయములు కొన్ని కడు విచిత్రముగ నుండును. సామాన్య హిందూయాచారములకు విరుద్ధముగ

యొక్కయు, పువ్వులయొక్కయు, యాకారములు చక్కగ గీసిన నోటుపుస్తకములు, ఇతరులు అడగకుండగనే తమంతటతాము వారికి చూపుదురు. లంబాడీలకు పశువులెటులనో, ఎరుకల వాండ్రకు కర్వేపాకెటులనో, దాసర్లకు పూసలెటులనో వీరికి పక్షియాకెలట్లు.

వీరు సొత్తుతో సంబంధించు నేరములుచేయుదురు. స్త్రీలు, పిల్లలు స్వల్పచోరీలు చేయుదురు.

ఈతెగ ఏబదిలేక అరువది చిన్నగుంపులుగ చీలియున్నది. అసలుగుంపులోనివారు ఒకజిల్లాగుండ పోవునపుడు ఎచ్చటనుదాగక బహిరంగముగ ప్రయాణము చేయుదురు. వీరి నాయకుడు రాగితోగాని కంచుతోగాని చేయబడి ఒక శాసనము చెక్కిన పళ్లెము తనతో తీసికొనిపోవును. ఈ శాసనము కంచిదేవాలయములో స్వామిపాదముల క్రిందనున్న యొకరాతిపై చెక్కబడిన శాసనపునకలని చెప్పుదురు. ఇది సింగపల్లి రామస్వామినాయకర్ యనునొక దొంగలనాయకునను, అతని సంతతివారికిని, కమ్మలలు, పళ్ళర్లు మొదలగు నన్ని జాతులవారి వద్దనుండి ఎల్లప్పుడు సొమ్ముగాని, బియ్యముగాని చందాపూర్వకముగ వసూలుచేసికొనుటకు అధికారము నిచ్చుచున్నది. ఒక జిల్లాగుండ అసలుగుంపు సంచరించునపుడు రెండు, మూడు చిన్నగుంపులు బహిరంగముగ వీరిని తరుచు కలుసుకొనక వీరి వెంటనంటి పోవుచుండును. ఈ చిన్నగుంపులవారు కొన్నిమైళ్ళదూరమందుండి యితరవృత్తి నేమియు జేయక నేరములనే చేయుచుందురు.

వీరు నేరములుచేయుటలో విశేషమేమియులేదు. సాధారణముగ దొంగతనము చేయుటకు ఒక వీధిచివర యిల్లు చూచుకొందురు. దొడ్డిగుమ్మము గడపక్రింద కన్నముత్రవ్వి యింట్లో ప్రవేశింతురు. ఇతరవస్తువులు ముట్టక లోపలపడుండి యుండువారి మెడలోగాని చెవులకుగానియున్న నగలకుమాత్రము వీరాసింతురు. తమ పాల్పడినవారినుండి నగలు తీసికొనునపుడు వారినెక్కువగ బాధపెట్టుదురు. ఇంటివారు కేకలువేసిన వీరు పారిపోదురు. వీరు తొందరసమయముల నిబ్బరముగ కాలూని శీఘ్రముగ పరుగెత్తగలవారగుటచేతను, ఆయుధపాణులగుటచేతను వీరిని పట్టుకొనుటకష్టము. వీరికి స్త్రీలు, పిల్లలు సమాచారములు దెత్తురు.

క్రొత్తగా కొట్టితెచ్చుకొను యడవికర్రలే వీరియాయుధములు.

వీరు కూర్చుండుట కుపయోగించు చాపమడతలలో దొంగసొత్తు దాయుదురు. అసలుగుంపువారు పల్లెలుచూపి చందాలు వసూలుచేయు మిషపైని తాముజూచు రిసీవర్లయొక్కయు కమ్మలులయొక్కయు సాహాయముచే దొంగసొత్తు విక్రయింతురు.

---

విషయసూచిక.

---

## రెండవ భాగము - ఇతర రాజధానులు.

# రెండవ భాగము - ఇతర రాజధానులు.

## 1 ప్రకరణము.

## భంప్తాలు.

---

'భంప్తా' అనిన మోసగాడని అర్థము. వీరు బొంబాయి రాజధానిలోని షోలాపూర్, సతారా, పునా, నాసిక్, అహమడ్ నగర్ జిల్లాలలో నెక్కువగ నివసించుచు ఆ రాజధాని యందంతట సంచరించుచు నేరములుచేయు తెలుగు తెగవారు. వీరిని పలుచోట్ల వేరువేరు నామముల బిలుతురు. వీరు తమ నామములచివర దాస్, సింగ్ అని కూడ జేర్చుకొందురు. ఒక కూటస్థులు తమలోతాము పెండ్లియాడక మరియొక కూటములోనివారిని వివాహమాడుదురు. వీరు మొదట నిజాంరాజ్యమునకో, లేక మరియే యితర తెలుగుదేశమునకో చెందినట్లు కనబడును. వీరు దేశమంతట వ్యాపించియుండుటకు ఇనుపదార్లు విశేషముగ ఏర్పడియుండుటయే ముఖ్యకారణము.

వీరు తమ గ్రామములలో స్థితిపరులుగ నుందురు. వీరిలో పేరుగలవారికి షుమారు 50, 60 వేల రూపాయల విలువజేయు భూమి యున్నది. వీరు రైలుపైచోరీలు, జేబుదొంగతనములు చేయుటయే తమవృత్తిగ నవలంబించుచు నేరములుచేయుటలో మిక్కిలి పేరుపడియుండుటచే ఉత్తర

హిందూస్థానములో భంస్తా యనునది దొంగకు మారుపద ముగ ఎల్లప్పుడు నుపయోగించబడుచున్నది.

వీరి కులకట్టుబాట్లు వీరినంతగ నిర్బంధించకపోవుటచేత వీరిదొక కులమనుటకంటె కూటమనుట మేలు. తక్కువజాతి వారినితప్ప మహామ్మదీయులు మొదలగు నితరజాతివారినంద రిని తమ సంఘములో జేర్చుకొందురు. వీరు దేశసంచారము చేయుచున్నప్పుడు వ్యభిచరించుస్త్రీలు కనబడిన వారిని తమ గుంపులో మొదట ఉంపుడుకత్తెలుగ జేర్చుకొని పిమ్మట పెండ్లి చేసికొందురు. తమదొంగవృత్తి నేర్పుటకు పిల్లలను దొంగిలిం చుటకూడ వీరిలో గలదు. వీరి గ్రామములలోనుండు దేవాలయ ములలో బడిపెట్టి తమ పిల్లలకు దొంగతనము, దొంగసొత్తు దాచుట మొదలగునవన్నియు నేర్పుట వీరి యాచారము. వీరిట్లు ఎనిమిది మొదలు యిరువది సంవత్సరముల వయస్సువరకు నేర్పి, వారు నేర్పరులైనపిదప తమగుంపులలో జేర్చుకొందురు.

ముక్కుపోగులు పెట్టుకొనుటకు వీరిస్త్రీలకు ఎడమ ముక్కునకు కుట్లుండును. ముఖముపైని, చేతులమీాద పచ్చ పొడిపించుకొనుట వీరిలోవాడుక. తరుచుగ కుడిచేతికంటె ఎడమ చేతిపైని ఎక్కువ పచ్చ పొడిపించుకొందురు. కన్నులచివర త్రిశూలాకారముగనుండు అందమగు పచ్చనొకటి పొడిపించు కొందురు. పెండ్లిచేసుకొన్నవారు తమమెడలో తాళీగ్రుచ్చి యుండు ఎఱ్ఱపూసల దండనొకటి ధరింతురు. నల్లపూసలపేర్లు కూడ ధరింతురు.

వీరు తెలుగుమాత్రమేగాక కన్నడము, మహారాష్ట్రము, హిందుస్తానిగూడ మాట్లాడుదురు. మహారాష్ట్రదేశములో తెలుగు, తెలుగుదేశములో కన్నడముగాని మహారాష్ట్రముగాని మాట్లాడుదురు. వీరు రహస్యముగ మాట్లాడుకొనుట కొకభాష గలదు. తమకుతప్ప నెవరికిని తెలియకుండ కనురెప్పలతోను, వ్రేళ్ళతోను వీరు సంజ్ఞలు చేసికొందురు.

వీరు తమవెంట తీసికొనిపోవు ఉంగరములు, మురుగులు, గుండీలు, ముక్కుపోగులు మొదలగు స్వల్పవస్తువులు వీరిస్త్రీలు అమ్మజూపి అందువల్ల జీవించునట్లు వీరు నటించుదురు.

వీరెప్పుడును ఒకరిద్దరు స్త్రీలతోకూడ దాదాపు పదిమందికి తక్కువగాకుండ గుంపుగ బయలుదేరి తరువాత రెండు మూడు చిన్నగుంపులుగ చీలిపోదురు. బయలుదేరకమునుపు వీరిలో నొక్కొక్కడు జరీబట్టలు, కోట్లు, శాలువలు, కాలిజోళ్లు, ఒకటి, రెండు తలగుమాళ్లు, అద్దము, విభూతిడబ్బి, కాటుక, శ్రీచూర్ణం, రుద్రాక్షతావళము, వేరువేరు మారువేషములు వేసికొనుట కుపచరించు కొన్ని పాతగుడ్డలున్న ఒకరైలుసంచిలో పెట్టుకొని తనతో తీసికొనిపోవును. సాధారణముగ వీరు మహారాష్ట్రులవలె మారువేషములు వేయుదురని చెప్పుదురు. కొన్నివేళల విలువగు దుస్తులు ధరించి రైలుకంట్రాక్టరులవలెను, సారాయి యిజారాదారులవలెను పోవుదురు. వీరు గుంపులుగ ప్రయాణముచేయుచున్నను ఒకరికొకరు తెలియనివారివలె నటించుచు విడివిడిగ పోవుదురు.

ఒకదానిపై మరియొకటిచొప్పున రెండు, మూడు మారు వేషములు వేసికొని క్రొత్తవేషములో కనబడ నెంచినప్పుడెల్ల పైదుస్తులు తీసివేయుదురు. అప్పుడు లోపల మరియొకవిధమగు దుస్తులుండుటచే వీరిని పోల్చి పట్టుకొనుట కష్టము.

వీరు తమ వృత్తాంతముల నెంతమాత్రము తెలియనియ్యరు. వీరికి నమ్మకము పుట్టించియు, వీరి నెరిగినవాని నొకని వీరితో పరస్పరముగ మాట్లాడించియు వీరిని గురించి కొంతవరకు తెలిసికొనుటకు అనువగు మార్గములు.

వీరు ఇనుపదారులు లేని కాలములలో నేరములు చేయు పద్ధతికిని యిప్పటి పద్ధతికిని మిగుల వ్యత్యాసముకలదు. వీరప్పుడు పట్నముల వెంబడిని, సంతలలోను తిరుగుచు పగటి వేళలయందే చోరీలు, జేబుదొంగతనములు చేసెడివారు. ఇప్పుడు యినుపదారులు వచ్చినతరువాత రాత్రివేళల రైలు బండ్లలో దొంగతనములుచేయుటచే, తాముధనికులగుటకు సులభమగు మార్గమని వీరు కనిపెట్టిరి.

ఒక క్రొత్తరైలుమార్గము పడినపుడు దానిప్రక్క నున్న యొక పెద్దపట్టణములో రైలుకంట్రాక్టరులమను పేరిట వీరొకయిల్లు ముందుగ అద్దెకు తీసికొని, ఆ యింటిలో నెప్పుడును కొందరుండునట్లుగ వంతులేర్పరచుకొని, యింటికావలి యుండనివారు గుంపులుగుంపులుగ ప్రయాణము చేయుదురు. రైలుస్టేషన్ వద్ద విలువగు వస్తువులున్నవని యూహించతగిన

మాటలతో ప్రయాణముచేయువారిని కనిపెట్టి, వారితో కలిసి బండినెక్కుదురు. వారితో మాట్లాడ మొదలుబెట్టి వారెచ్చటకుపోవునది తెలిసికొందురు. రాత్రి వారు నిద్రావేశులై యుండునప్పుడు వీరిలోనొకడు వారుపరుండ సదుపాయము చేయువానివలె, క్రిందికిదిగి, నిద్రపోవువానివలె నటించుచు, ఒకబట్ట తలనుండి కాళ్ళవరకు కప్పుకొనును. మరియొకడు తన ఎదుటనున్న బల్లపైకి కాళ్లుచాచి క్రిందపరుండినవాడు కనబడకుండ బట్టకప్పుకొనును. ప్రయాణీకులు గాఢనిద్రలో నున్నప్పుడు క్రిందివాడు కత్తితోగాని కత్తెరతోగాని వారిసంచులు కోసి ఉలితో నారిపెట్టెలు తెరిచి అందున్న ఆస్తి రెండవ వానికి అందజేయ నిద్దరును ప్రక్కస్టేషనులో దిగిపోదురు. ఆస్తి పట్టుబడునని తోచునప్పుడు గవాక్షములగుండ దానిని మొదట క్రిందపారవైచి తాము రైలుదిగినపిమ్మట వెనుకకు పోయి, తీసి తెచ్చుకొందురు. మరికొన్నిసమయముల సంచులుమొదలగునవి విప్పకుండగనే వారు నిద్రించియున్నప్పుడు తమసంచిమొదలివేసి వారిసంచి నెత్తుకొని పారిపోదురు.

వీరు రైలునడుచునపుడు దిగుటలోగూడ నేర్పరులే. ప్రయాణీకులసొత్తు రైలుబండిలో దొంగిలించ వీలుపడనప్పుడు వారుదిగిన స్టేషనువద్ద దిగి వారు నిద్రించునపుడు ఆస్తి దొంగిలించి పారిపోవుదురు. ఒకప్పుడు వీరివెంట ఒకపిల్లవాడు గూడ నుండును. వాడు ప్రయాణీకులదృష్టిని తనపై మరిలింప జేసికొని తన పెద్దవాండ్రకు నేరములుచేయ నవకాశము కలిగించును. తరుచుగ ఆపిల్లవాడు నేరముచేసెనని అనుమానిం

తురు. ఆ సందడిలో అసలుదొంగ కనబడకుండ పారిపోవును. పిమ్మట ప్రయాణీకులు ఈ కుఱ్ఱవానిపై జాలిదలచి ఒకటి, రెండు దెబ్బలుకొట్టి విడిచిపెట్టుదురు. భంప్తాలు ముఖ్యముగ రైలుస్టేషనుల వద్దను, విశేష జనసమూహములుండు యితర స్థలములయందును తమ పిల్లల సహాయముచే నేరములు చేయుదురు.

వీరిని పట్టుకొనునప్పుడు మిగులశ్రద్ధయు ఓరిమియు కలిగి వీరిపై బాగునిగహా యుంచవలయును. ఏపనియు తొందరపడి చేయరాదు. అటులచేసిన గుంపువారది మెళుకువతో కనిపెట్టి తప్పించుకొని పారిపోదురు. వీరొకరినొకరు చూచుకొను విధములబట్టియు, చేసికొను సంజ్ఞలబట్టియు, సామాన్యప్రవర్తనబట్టియు, ఒండొరులకు గల సంబంధము తరుచుగ మనము తెలిసికొనవచ్చును. పోలీసు ఉద్యోగస్థుడు భంప్తాల ననుమానించునపుడు, వారిచే చూడబడకుండ రైలు బండినంతయును తనిఖీచేసి, ఆ గుంపువారినందరిని కనిపెట్టుటకు ప్రయత్నించి పిమ్మట కాలయాపనముచేయక వెంటనే వీరినందరి నొక్కమాటుగ పట్టుకొననేర్పాటు చేయవలయును. వీరు పట్టుబడినపుడు తమను కాచియుండువాని కంటిలో మన్ను చల్లి పారిపోవుటకు తగినసమయము చూచుచుందురు.

ఏభాగమువిడువకుండ వీరిశరీరమంతయు పూర్తిగ సోదాచేయవలయును. పిమ్మట వీరిమూటలు, సంచులు సోదా చేయవలయును. కొన్నిసమయముల వీరు నేర్పుగసొత్తు ఒకరి

శాకరు అందించుకొందురు. వీరట్లు చేయకుండ దూరముగ నిలవబెట్టవలయును. మామూలుగ వీరితో ఒకరిద్దరు స్త్రీలు గూడ ప్రయాణము చేయుచు ఆడవారి బండ్లలోపలికి పోయి తమపురుషులవలెనే దొంగిలింతురు. వీరు తిరిగి యింటికివచ్చు నప్పుడు తమగుంపువారు దొంగిలించియిచ్చు నగలన్నియు తమ మొలచుట్టు భద్రపర్చెదరు. గనుక శ్రద్ధతో వీరిని సోదాచే యవలయును. సోదాకాలమప్పుడు వీరు తరుచుగ మలవిసర్జనకు వెళ్ళగోరుట అనుమానించతగిన విషయమే తరుచుగ వీరీమిష పైని వెళ్లి తమబంటిపైని,మర్మస్థానములయందు దాచినసొత్తుతో పారిపోయినట్లుగూడ చెప్పుదురు. వీరు తొడలపై కదెస్సినోట్లు కట్టుకొందురు. ఆకట్లు విప్పమన్నప్పుడు కురుపులేచి కట్లుకట్టు కొనినట్లు నటింతురు. వీరు బట్టలుదొంగిలించినపుడు వాటిని సాధారణముగ తమపడకలలో దాచుదురు.

వీరియిండ్లు గ్రామమునంటియుండక ప్రత్యేకము ఒక పల్లెగ నేర్పడి ఒకయింటినుంచి మరియొక యింటికిని తరువాత పల్లెవెలుపలకిని దొంగసొత్తు సులభముగ దాటించుటకు వీల గులాగున కట్టబడి యుండుటచే వాటిని సోదాచేయుట కష్టసా ధ్యము; ఇండ్లనుండి బయిటకు ఆస్తి పోకుండునట్లు పల్లె వెలు పల పహారాయుంచి యిండ్లు సోదాచేయవలయును.

వీరిని సోదాచేయవలసిన కాలము గమనించతగిన మరి యొక ముఖ్యవిషయము సాధారణముగ వీరికేమాత్రము అను మానము గలిగినను అతిజాగరూకతతో నుందురుగనుక పగ

టివేళ వీరియిండ్లు సోదాచూచి ఆస్తిపట్టుకొనుట అసాధ్యము అందుచేత రాత్రివేళ వీరుండుపల్లె ముట్టడివేసి ఉదయమున ఏమరుపాటుగ సోదాచేయుట మంచిపద్ధతి.

వీరు పెట్టెలు పగలకొట్టుటకొక ఆరుఅంగుళముల పొడుగు అరంగుళము వెడల్పుగల ఉలి, కత్తి, ఇనుపకాడ, పెట్టెలతాళములు తీయుటకొక యినుపకొక్కెము, జేబులు కత్తిరించుటకొక కత్తెర తమతో తీసికొనిపోదురు. ఒకచిన్న వంకరకత్తి తమనోటిలో పెట్టుకొనివెళ్ళి దానితో సంచుల దారములు కోయుదురు. వీరాకత్తి బుగ్గను పెట్టుకొందురు. వీరట్లు చేయగలుగుటకు కొన్ని ఉప్పురాళ్ళను రేయింబగళ్లు కొంతకాలమువరకు తమబుగ్గను పెట్టుకొని అలవాటు చేసికొందురు. పై పెదవిక్రిందను, పండ్లచిగురునకును మధ్యను కూడ దానిని దాచుదురు.

నేరములుచేయు నితరగుంపువారివలెనే వీరికిని తమస్థలములయందు రిసీవర్లు గలరు. మార్వాడీలు వీరికి ముఖ్యమగు రిసీవర్లు. వీరియిండ్లు సమీపమందున్నయెడల తమ గుంపు వారిలో ఒకరిద్దరిచే దొంగసొత్తు నింటికి పంపుదురు. విలువగలనగలు బంగీకట్టియు, నగదు మనిఆర్డరుచేసియు టపా ద్వారా పంపుదురు. వీరు నేరములుచేసి తిరిగి వచ్చినపిదప దొంగసొత్తంతయు పంచుకొని, తమనాయకుడు నేరము చేయుటకు వచ్చినను, రాకున్నను, వానికి నిండుభాగము నిత్తురు. వీరు ఒకప్పుడు ఆస్తిపంచుకొనుటలో కలహింతురు



చాపరబందులు.

ఆ జాడలు పోలీసువారికి తెలిసినపుడు, వీరొకనిని కొంత దొంగ సొత్తుతో వారికి ఒప్పగించి, వాడు జయిలులోనుండుకాలము వానిసంసారమును పోషించుచుందురు.

వీరు దొంగసొత్తు రిసీవర్లకు విక్రయించబోవునపుడు వారితో బేరమాడుటకు ఒకరిద్దరు ముందుగ వెళ్ళుదురు. ఆ స్తి తీసికొని వెళ్ళువారు వెనుక నటునిటు తిరుగుచుందురు. అట్టి సమయమున పోలీసువారు వీరిని అరెస్టు చేయదలచుకొన్న యెడల ఆస్తిగలవారు పారిపోకుండ జాగ్రత్తపడవలయును.

వీరు హిందూమతస్థులు. కాళిని పూజింతురు. షోలాపూర్ జిల్లాలో అకల్‌కోట సంస్థానములో కోనాలిగ్రామములో ముఖ్యమగు కాళీదేవాలయము గలదు. నేరములు చేయుటకు పూర్వము నేరములుచేసినపిమ్మట వీరాదేవాలయమునకు పోయి పూజచేయుదురు. వీరెక్కడనున్నను తమదేవతకొక గుడికట్టుదురు. నేరములు చేసివచ్చినతోడనే దొంగసొత్తు ఆ దేవత పాదములవద్ద నర్పించి అమితముగ త్రాగి యానందింతురు.

---

2 ప్రకరణము.

# చాపరబందులు.

---

వీరు తప్పునాణెములు చేయుటలో పేరుపడిన తురకలు. వీరిది బొంబాయిరాజధానిలోని బీజపూర్.

తమవైపునకు వచ్చువారిని చూడవీలగులాగున సాధా రణముగ నీళ్ళసమీపమందుండుఎత్తుప్రదేశముల వీరుబసచేయు దురు. వీరు భయపడునపుడు నాణెములు, వాటి యచ్చులు దాచి, పట్టుబడబోవునపుడు నీటిలో పారవైతురు.

వీరు తప్పునాణెములు చేయునప్పుడు జాగరూకతతో నుండి ఎవరైన సమీపమునకుపోయిన అనుమానింతురుగాని సమీపముగ బోకుండ, స్నానముచేయుటకు పోవు హిందు వులను వీరు లక్ష్యముచేయరు.

వీరు భయభక్తులుగలిగి యిండ్లవద్దనున్నప్పుడు గౌరవ ముగ జీవింతురు. వీరు బిచ్చగాండ్రవలెను, స్త్రీలు చాపలు, బొంతలు చేయువారివలెను పైకి కనబడుదురు.

వీరు నేరములుచేయుటకు వెళ్ళకపూర్వము తమగ్రామ మునకు కడుదూరమందుండు స్నేహితునియింటికి పోయి అచ్చట 'ముదార్యఫకీర్లు' వలె మారువేషములు వేసికొని, పేర్లకుచివర 'షా' గాని 'సాహెబు' గాని జేర్చుకొని వారు బిచ్చమెత్తునప్పుడు పాడులాగున వీరుకూడ 'సవాలు' పాడు దురుగాని వారుపాడుదానికిని, దీనికిని ఎక్కువ వ్యత్యాసము కలదు బిచ్చమెత్తుకొనునప్పుడు కిష్టా అనెడి నల్లని టెంకాయ చిప్ప చిమటా. మేకతోలుతోగాని గుడ్డతోగాని కుట్టబడిన సంచియు, వీరివద్దనుండును. ఆ సంచిలో తప్పునాణెములను వాటిఅచ్చులను దాయుదురు. వీరు మెడలో గాజుపూసల

దండలు వేసికొని పసుపురంగు లేక ఆకుపచ్చరంగు గుడ్డనొకటి తమ తలలకు వెనుకను కొంత జూలువిడిచి చుట్టుకొందురు.

1. స్త్రీలతో ప్రయాణముచేయు నిజమగు ఫకీర్లు తమ వెంట సామాన్యముగ పిల్లలను తీసికొనిపోరు. చాపరబందులు స్త్రీలనెప్పుడు తీసికొనిపోక మొగపిల్లలను మాత్రము తీసికొనిపోదురు.

2. ఈ రాజధానికి బయిటనుండివచ్చు ఫకీర్లు సామాన్యముగ నొంటరిగను, కొన్ని వేళలమాత్రము సంసారముతోను, ఒకానొకప్పుడు ఒకరిద్దరు ఫకీర్లతోను ప్రయాణముచేయుదురు. చాపరబందులు ప్రయాణముచేయునప్పుడు సామాన్యముగ నలుగురికి తక్కువగ పోరు.

3. చాపరబందులు మామూలుగ ఫకీర్లు దిగు సత్రములు మొదలగు స్థలములలో దిగక దూరమున మరుగుగానుండు స్థలముల దిగి నిజమగు ఫకీర్లను చూచుటకిష్టపడక, తప్పునాణెముల నిరాటంకముగ చేయగోరుదురు.

4. కొనుక్కొనుటకు సొమ్ము లేకపోయినను ఫకీర్లు గంజాయి మానలేరు. చాపరబందులు గంజాయి సామాన్యముగ త్రాగుటయే లేదు.

5. ఫకీర్లు సాధారణముగ ఆహారపదార్థములు కొననే కొనరు. ఒకవేళ కొనిన రాగినాణెముల నిచ్చికొందురు. చాప

రబందులు తిండిసామగ్రులు తాము చేసిన తప్పుదూపాయలు, చిల్లర వెండినాణెములు యిచ్చి కొందురు.

6. చాపరబందులు తమ ఫకీరువంశక్రమమును గురించి గాని, తమ వృత్తాంతముల గురించిగాని చెప్పుట కిష్టపడరు. వీరు ఫకీర్లవలె బియ్యము పుచ్చుకొనక సొమ్ముకై బిచ్చమెత్తుదురు. వీరు తమవద్ద నెంతమాత్రము తప్పునాణెములు అచ్చులు నుంచుకొనక తాము దిగియుండు స్థలములవద్దనుండు పెంటలోగాని, యితరకుప్పలలోగాని దాయుదురు.

వీరు సాధారణముగ ముగ్గురు మొదలు పదుగురువరకు చిన్న గుంపులుగ ప్రయాణము చేయుదురు. వీరు స్త్రీలనెంత మాత్రము తీసికొనిపోక ఒకరిద్దరు పిల్లలనుమాత్రము తీసికొనిపోదురు. వీరినాయకుని 'ఖగడ' అని పిలుతురు. వీరందరు అతని ఆజ్ఞకు లోబడవలయును. అతడు గుంపుయొక్క సొత్తు, అచ్చులు, మన్ను, సీసము తనవద్ద నుంచుకొనును. తప్పునాణెములు చెలామణి చేయువానిని 'భండరు' అని పిలుతురు. అతడు తప్పునాణెములు తన వశమందుంచుకొనును. ఈ గుంపుతో వెళ్లు పిల్లవానిని 'హాండివాల్' అని యందురు. అతడు గుంపు మకాముచేయు స్థలములలో ప్రతిపనిని చేయుచు, వీరు తప్పునాణెములు చేయుచున్నప్పుడు ఇతరులు రాకుండ కాచియుండును. తప్పునాణెములు వీరు పగటివేళ చేయుదురు.

ప్రయాణము చేయునప్పుడు ఖగడయు, హాండివాలును తాము మకాముచేయదలచిన సమీపస్థలములకు తిన్నగ కలి

సిపోదురు. భండర్లు అటులకాకుండ ఆ చుట్టుప్రక్కలనుండు గ్రామములగుండ తప్పునాణెములు మార్చుకొనుచు మొదట వీరందరేర్పర్చుకొన్న స్థలమునకు క్రమక్రమముగవచ్చి జేరుదురు. వీరు వీలయినంతవరకు రోడ్డుప్రయాణము చేయరు. ఖగడ, తామువర్పర్చుకొన్న స్థలము సదుపాయములేనిదిగ తలచునపుడు, తామందరు మరియొక క్రొత్తస్థలమునకు బోవుచు భండర్లకు ఆ క్రొత్తస్థలము తెలియుటకు తాను ముందుదిగిన స్థలమునుండి క్రొత్తస్థలమునకు వెళ్ళు మార్గములో కొన్ని గుర్తుల నుంచును. అవి రోడ్డునకు ప్రక్కగ నొకయడుగు పొడుగు ఆరుఅంగుళముల ఎత్తుగలిగి వారు పోయిన మార్గమును సూచించు గుర్తులు గల మంటిదిమ్మలు. ఒకప్పుడొకటి పాడైనను యితరదిమ్మల సాహాయముచేతనైన ప్రయాణము చేయవీలగులాగున సాధారణముగ నూరుగజముల కొకటి చొప్పున మూడు దిమ్మలు వేయుదురు.

వీరు తప్పునాణెములు రెండువిధములుగ చేయుదురు. 'ముల్తానీ' గాని మరియే బంకమంటితోనైననుగాని అచ్చులుచేయుదురు. మంటిముద్ద పొడిచేసి, జల్లించి కొంచెము నీళ్ళగాని నూనెగానిపోసి బాగుగకల్పుదురు. బొమ్మ, అక్షరములు పడులాగున రెండుడిప్పలు మొదట చేతితోచేసి ఒకమంచినాణెము ఆడిప్పలమధ్య నదిమి పిమ్మటపొయిలో దానినికాల్చి కరిగించిన లోహము అంచునుండి లోపలకు పోవులాగున కన్నముపొడిచి పిమ్మట ఆ రెండుడిప్పలు వేరుచేసి మంచిరూపాయ దానిలో నుండి తీసివేయుదురు. తిరిగి ఆ విడి డిప్పలను జేర్చి కరిగిన

తగరము దానిలోపోసి చల్లారబెట్టుదురు. ఇది మొదటపద్ధతి.

రెండవపద్ధతి ఏదన.- వీరు తమ దేశమునుండి తెచ్చు కొను 'బాడప్' మన్ను అచ్చులు చేయుటకు తగినదిగ నెంతురు. అది లేనప్పుడు మాత్రము 'ముల్తానీ' మంటి నుప యోగింతురు. దీనిని బాగుగ నీళ్ళుపోసి కలిపి రెండుడిప్పలు చేసి జొన్నకంకెతో వీటిలోతట్టున ఎక్కువ నునుపుచేయు దురు. మంచిరూపాయకు కొంచెము నూనెరాసి, ఈ డిప్పల మధ్యపెట్టి గట్టిగనొక్కి అది గట్టిపడుటకు నిప్పులోకాల్చి దానిలో ముందువలె కరిగిన తగరముపోయక, రాగి, సీసము కలిపి కరగించిన మిశ్రలోహము పోయుదురు. ఈ రెండుపద్ధతు లలోగూడ కత్తి, ఆకురాయి మొదలగువాటితో అంచున గీతలు గీయుదురు.

వీరిలో భండర్లకు తప్పునాణెములు మార్చుటకు అమాయకులగు స్త్రీపురుషులను వెదకుటయే పని. వీరు సామా న్యముగ తాము బిచ్చమెత్తి తెచ్చిన రాగినాణెములు చూపి వాటికి వెండినాణెముల నిమ్మని కోరుదురు. పాపము వారొక రూపాయ తెచ్చి భండర్లకిత్తురు. వీరది పుచ్చుకొని చూచు చున్నట్టు తలయూచుచు ఆ నాణెము తమదేశములో మారదని చెప్పుచు నొక తప్పునాణెమునిచ్చి దగాచేయుదురు. ఈ విధముగ నన్నిచోట్ల మోసముచేయ ప్రయత్నించుదురు. వీరు "హాండివాల్"గ నున్నప్పుడెక్కువ అనుభవశాలులగు టచే రూపాయలు అతి నేర్పుగ మార్చుదురు.

వీరు దిగియుండు స్థలములలో జొన్నకంకులుగల వెదురు గొట్టములు, అనేకరకముల కత్తులు, పెద్ద యినుపగరిశెలు, పటకారులు, సత్తునగలు, సీసపుముక్కలు, నూనె, బంక మన్ను, రోలు, రోకలి, వెండి, రాగినాణెములు అనేకరకముల రాళ్ళు, ఆకురాళ్ళు, కత్తెర్లు, మంచిమన్ను వీరివద్ద నుండును. ఆ మంటినొక. విగ్రహములాగుననో, మరియొకవిధముగనో చేసి యుంచుకొందురు. లాభకరమగు సమాచారములు ఆ గుంపులోనుండు "హండివాలు"ద్వారా తెలిసికొనవచ్చును. కొన్నిసమయముల తనకు తెలిసినదంతయు స్పష్టముగ ఎకరదు పడమనికూడ వానిని ప్రోత్సాహపర్చవచ్చును.

వీరు చెదరిపోయి మకాములో లేనప్పుడు అచ్చటకు వెళ్ళ ప్రయత్నించగూడదు. వీరందరు తిరిగి మధ్యాహ్నము తమమకామునకు జేరుదురు. తప్పునాణెములు చేయుచున్న ప్పుడు వీరిని చూడవలెనన్న నీటిదగ్గిరకు స్నానముచేయువాని వలె పోయి చూడవచ్చునుగాని నొంటరిగపోయిన ప్రయోజ నములేదు. వీరు నాణెములుచేయుట పూర్తియగువరకు వెళ్ల కుండుటయే మేలు.

ఒకగుంపును సోదాచేయునప్పుడు ప్రతివానికిని తక్ష ణమే బేడీలువేసి వేరువేరుగ నుంచవలయును. లేనియెడల వీరి లో వీరు అకస్మాత్తుగ జగడమారంభించి ఆగత్తరలో అచ్చా లు నాణెములు పారవైతురు. సోదాచేయునపుడు వీరి లంగో టీలు బాగుగ తనిఖిచేయవలెను. లంగోటీ ముందువైపు

లోనుగానొక సంచియుండును. దానిలో తప్పునాణెములు దాయుదురు. చిరకాలాభ్యాసముండుటచే వీరు ఆసనములో గూడ నాణెములు దాయుదురు. యిరువదియైదు కాసుల వరకు అచ్చట దాచియున్నట్లు చెప్పుదురు.

సాధారణముగ సీసముకలిపిన లోహముతో వీరు చేసిన నాణెములను త్వరగ పోల్చవచ్చును. శుభ్రమైన కాగితముతో దానిని తోమిన సీసమంతయు పోవును. ఒకప్పుడు మంచినాణెమో తప్పునాణెమో చెప్పలేనంత బాగుగకూడ వీరు నాణెములు చేయుదురు. నాణెములు పరిశీలించునపుడు ఈ క్రింది విషయములు గమనించవలయును.

1. అనుమానముగల నాణెము, సాధ్యమైనంతవరకు అదే వివరముగల రెండు మంచినాణెములలో కల్పి మంచివెలుతురులో పరిశీలించవలయును.

2. మంచినాణెము, రాతిమీదనైన, పలకమీదనైన, మరియేగట్టివస్తువుమీదనైన కొట్టిచూచిన ఖంగుమను ధ్వనినిచ్చును. తప్పునాణెములు బాగుగమ్రోగవు.

3. మంచినాణెము వెండితోచెయ్యబడి వాడుకనుబట్టి తెల్లగను, మాసినరంగు గలదిగను యుండును. తప్పునాణెము సాధారణముగ యిత్తడి లేక నల్లగమాసిన సీసపురంగు కలిగియుండును. ఒకవిధమగు మెరుగుగూడ కొన్నిటికుండును.

4. మంచినాణెములకు అంచుచుట్టు ఒకేదళసరి యుండును. తప్పునాణెములఅంచు (ముఖ్యముగ కొట్టిన నాణెములు) కొన్నిచోట్ల దళసరిగను కొన్నిచోట్ల పలచగను ఉండును. నాణెముకూడ హెచ్చుతగ్గులుగ నుండును.

5. మంచినాణెము అంచుచుట్టు బొమ్మకు సరిమూలగ నిలువుగీతలు హెచ్చుతగ్గులు లేక సమానదూరమందు గీయబడియుండును. 1904 సంవత్సరమునుండి చేయబడిన రూపాయలకు అంచుచుట్టు 150 గీతలుండును. తప్పునాణెములలో ఈగీతలు ఏటవాలుగను, గీతకు, గీతకుమధ్య హెచ్చుతగ్గులుండును. అంచులు సమానముగనుండక పగిలియుండును. ఒక తప్పునాణెములోని గీతలు సరిచూచుటకు, అదేవివరముగల రెండు మంచినాణెములమధ్య దానినుంచి ఈ మూటిఅంచులు దగ్గిరగనుంచిన కనిపెట్టవచ్చును. లోపములున్న వెంటనే తెలియును.

6. మంచినాణెములో అంచులోపలనుండు చుక్కల వరస సమముగను, క్రమముగను ఉండి చుక్కలు ఆకారములోను, పరిమాణములోను, సమానమై ఒకటికొకటి సమదూరమందుండును. తప్పునాణెములోని చుక్కలు సమానముగనుండక ఎగుడుదిగుడుగ నుండును. మరికొన్ని తప్పునాణెములలోని చుక్కలు చిన్నవిగను, ఒకటికొకటి చాల దూరమందుండును. 1840 సంవత్సరపు మంచినాణెములలోగూడ నిటులనేయుండును.

7. మంచినాణెమునకు యిరుప్రక్కలనుండు బొమ్మయు, అక్షరములును స్పష్టముగ వివరించబడి యుండును. చివరల చింకిరిగీతలుండుటయు, ముద్ర స్ఫుటముగ కనుపించకుండుటయు తప్పునాణెమని అనుమానించుటకు కారణములు. (ఒకప్పుడు మంచినాణెములుగూడ చిరకాలము వాడుటచే యిట్లు కనిపించుట కలదు.)

8. మంచినాణెముపై చెక్కిన అక్షరములు, అంకెలు, కురుచకొనగలిగి స్పష్టముగ వివరించబడియుండును. కొంకిరిగను, ఎగుడుదిగుడు లేక జంటగీతలున్న అనుమానించతగినదే. కొన్ని తప్పునాణెములపైని అక్షరములు మంచినాణెములపైనుండు అక్షరములకంటె నున్నితముగనుండును.

9. మంచినాణెములో బొమ్మ, అక్షరములు లేని స్థలము నున్నగను, సమానముగను ఏవిధమగు కొరతయు లేకుండయుండును. ఈ భాగమునున్నగను, సమముగను లేక హెచ్చుతగ్గులుకలిగి మచ్చలున్నయెడల తప్పునాణెముగ అనుమానించవచ్చును.

10. మంచినాణెపు అంచుకొన చేతితోతాకిననున్నగనుండును. అటులుండక మోటుగను, హెచ్చుతగ్గులుగనుండిన తప్పునాణెముగ అనుమానించ తగినదే.

11. పోతనాణెములన్నియు తప్పునాణెములు. వాటిపైతట్టున సూదిబెజ్జములంత చిన్న నల్లని మచ్చలుండును.

వాటిని సూదితోగాని గుండుసూదితోగాని గీచిచూచిన స్పష్టముగ తెలియును.

అచ్చులోనికి లోహముపోయుచోట గీతలు సరిగానుండవు. పోతనాణెములలో అక్షరములు, అంకెలు కొనతేరి చొకముగ నుండుటకుబదులుగ సాధారణముగ నెప్పుడును గుండ్రముగానుండును.

**12.** తప్పునాణెములకు పైజెప్పబడిన యంశములలో అధమము రెండులోపములైన తప్పకయుండును. ఎన్నతగినంత లోపము లేనప్పుడు ఒక్కలోపమున్నంత మాత్రమున నాణెము రద్దుపర్చరాదు.

వీరు ముూఢభక్తులగుటచే తమగ్రామములనుండి బైలు దేరకముందు శకునములు చూచుకొందురు. ప్రతిఆదివారము, తప్పునాణెములు వాటినిచేయుఅచ్చులు పోగుచేసి తమనీపాడు వృత్తియందు దింపిన "పీర్ మఖన్"కు పూజ చేయుటగలదు.

---

## III ప్రకరణము.

# బౌరియాలు.

---

వీరు ఉత్తర హిందుస్థానమునుండి వచ్చిన నేరములు చేయు తెగవారు. వీరు చిరకాలమునుండి ఈ రాజధానియందంతటను, నేరములుచేయుచు దక్షిణజిల్లాలలోకూడ పట్టుబడకుండ నేరములు చేయుచున్నారు.

వీరు నేరములుచేయు నితరగుంపువారికంటె చక్కగ దుస్తులు వేయుదురు. వీరిలోకొందరు నుదుట గోపీచందనము విభూతి ధరింతురు. మరికొందరు వైష్ణవులవలె నామములు పెట్టుకొందురు. జందెములు రుద్రాక్షలు వేసికొందురు. వీరు తమలో చిమటా, కమండలము, పులిచర్మముగాని లేడిచర్మముగాని, తీసుకొని పోవుచుందురు. వీరివద్ద రామాయణము భగవద్గీత మొదలగు మతగ్రంథములుండును. దాస్ అనిగాని గిర్, అనిగాని పేర్లకుచివర వీరు జేర్చుకొందురు. పెద్ద మర్రిచెట్లక్రింద తమతో తీసికొనిపోవు చర్మములపై కూర్చుని మతగ్రంధములనెప్పుడు చదువుచుందురు. నిజమగు బైరాగులు సయితము వీరిని గుర్తించలేక మోస పోవునంత బాగుగ వీరు ప్రార్థనలు, పూజలు, మతాచారములు మంత్రపఠనము చేయుచుందురు. వీరొకప్పుడు గడ్డము పెంచు కొందురు. కొన్నివేళల తల పూర్తిగ క్షవరము చేసికొందురు. మరికొన్నిసమయముల కొంచెము జుట్టుంచుకొని క్షవరము చేయించుకొందురు. వీరిట్లు చేసినను నిజమగు బైరాగులకును వీరికినిగల భేదము తెలిసికొనుటకు మార్గములు కొన్నిగలవు.

1. వీరు హిందువులందరు కట్టుకొనువిధమున ధోవతి నొకటి ఒక కాలగుపడునట్లు కట్టుకొందురు. బైరాగులు ఈ రీతినెప్పుడు కట్టుకొనరు.

2. వీరు చేతులులేని చొక్కాలను తొడుగుదురు. వీరిని గుర్తించవీలులేకుండ వాటిని విప్పివేసినను, అవి వీరి

మూటలలోనే యుండును. బైరాగులు చొక్కాలు తొడగనే తొడగరు.

3. వీరెచ్చటనైనను క్షవరము చేయించుకొందురు. బైరాగులు రామేశ్వరము మొదలగు పుణ్యక్షేత్రములవద్ద గాని, పుణ్యనదులవద్దగాని క్షవరము చేయించుకొందురు. మన మొకనియొద్ద గోధుమగింజలుగాని జొన్నగింజలుగాని చూచిన నాతని బౌరియాగ ననుమానించవచ్చును. మామూలుగ ఈగింజల నొక చిన్నయిత్తడి లేక సీనారేకు డబ్బిలోవేసి తీసుకొనిపోదురు. వీరది ఒకవిధమగు ఔషధమని చెప్పుదురు.

"జ్ఞాన్"అను ఇనుపపనిముట్టు యున్నవానిని తప్పక బౌరియా అనవచ్చును. భాషనుబట్టికూడ దృఢముగ తెలిసికొనవచ్చును. వీరికి ప్రత్యేకమొక భాష గలదు. వీరు ఒంటరిగ తామున్నప్పుడుమాత్రము ఈ భాష మాట్లాడుదురు. ఇతరులతో హిందుస్తాని మాట్లాడుదురు. కొంతమంది బౌరియాలుగ కనపడి తమభాష మాట్లాడకున్నప్పుడు వారెవరో తెలిసికొనుటకు వారిపిల్లలను, విడిగపిలిచి మాట్లాడవలెను. వారు బౌరియాలయిన ఆ పిల్లలు తప్పక తమభాషనే మాట్లాడుదురు.

వీరి గుంపుజాడ తీయవలసివచ్చినప్పుడు, వీరు తరుచుగ నిలుచు గ్రామసమీపముననుండు, తోపులు మండపములు తనిఖీచేయుట మిగులప్రయోజనకారి. ఈక్రిందచూపు కొన్ని గుర్తులు కనబడిన వీరుతప్పక ఆ ప్రాంతములనున్నట్లు ఊహిం

చవచ్చును. ఈగుర్తులబట్టికూడ వీరునికి నిర్ధారణ చేయవచ్చును.




ఏ.బి.సి.డిగుర్తులు ఉత్తరము, తూర్పు, దక్షిణము, పడమర దిశలలో నేవైపునకు వీరు పోయినది దెల్పును. కొంక్కాముగల గీతపైనుండు చిన్ననిలువుగీతలు వీరిగుంపు మొత్తము దెల్పును. గుర్తుఈ, వీరు గ్రామములోపల దిగియున్నట్టు దెల్పును. గుంపు రెండుగ చీలినట్టు ఎఫ్‌గుర్తు సూచించును. ఏడుగురు మనుష్యులు తూర్పుదిశకు పోయినట్టు జీగుర్తు చూపును. వీరు ఆస్తితో తూర్పువైపునకు వెళ్లుచున్నట్లు ఎచ్చ్‌గుర్తు సూచించును. వీరొక స్థలముచూచినట్టున్ను, పిమ్మట మరిరెండు గుంపులువచ్చి తూర్పువైపునకు పోయినట్టున్ను ఎల్‌గుర్తు దెల్పును. ఈ గుర్తులు మైలురాళ్ళపైని, చెట్లపైని, రోడ్లుకలియుచోట్లనుకూడ నుండును. వీటిసహాయముచే వీరెక్కువదూరము పోయినను, వీరిజాడలు తీయవచ్చును. రోడ్లుకలియుచోట వీరు కొన్నిసమయముల రాళ్లు కుప్పలుగ పెట్టుదురుగాని, వాటిని మార్చుట కవకాశముండుటచే దానినంతగ నమ్మగు. కాలానుకూలముగ వీరీగుర్తుల తరుచు మార్చుటయు గలదు. అదియునుగాక ప్రతి

గుంపునకును ఒక్కొక్క విధమగు గుర్తులున్నట్లు కనబడును. ఈ రాజధానిలోని జనులు దేవనాగరిభాష నెరుగరనికాబోలు వీరు దిగియుండు స్థలములలో బహిరంగముగ తమ రాకపోక లను గురించి గోడలపై దేవనాగరిలో వ్రాయ మొదలుబెట్టు చున్నారు. వీరిని మిగుల శ్రద్ధతో కనిపెట్టవలయును. వీరినేవి ధమగు ప్రశ్నలు వేయకుండ నెమ్మదిగ కనిపెట్టవలయును. వీరిని కనిపెట్టునప్పుడు వీరు నిజమగు బిచ్చగాండ్రవలె కనబడు దురు. ఆపిమ్మట వీరా గ్రామమువిడిచి తనగుంపువారు నిలిచి యుండు తావు జేరుదురు. అప్పుడు వీరి వెంట పోవలయును. వీరు దిగియుండు స్థలము సోదాచేయ నిశ్చయించుకొన్నప్పుడు, తెల్లవారగనే సోదాచేయవలయును. అప్పుడువీరి గుంపువారం దరు హాజరుందురు. స్త్రీలను, పిల్లలను గుంపునుండి విడదీసి ముందుగ సోదాచేయవలయును. స్త్రీలు తమపిల్లలచే దొంగ సొత్తు సోదాచేయబడిన మగవారికి ఏదైన మిషపైని పంప ప్రయత్నించుదురు. గనుక వీరినెవరిని అచ్చటనుండి ఎంత మాత్రము కదలనియ్యకూడదు. స్త్రీలు 'జ్ఞాన్' పనిముట్టు తమబట్టలో దాచ ప్రయత్నించుదురు.

వీరెక్కువ వెర్రినమ్మకము గలవారగుటచే శకునములు చూడకుండా ఏపనిచేయరు. వీరెప్పుడు ఆదివారము, మంగళ వారము, లక్ష్మివారము, శుక్రవారము, మంచిదినముగ దలచుదురు.

వీరు సాధారణముగ గోసాయిలు, బైరాగులు, సాధు లవలె మారువేషములు వేయుదురు. వీరిని పట్టుకొన్నప్పుడు,

తాము నేపాళదేశస్థులుగ నిప్పుడిప్పుడు చెప్పుకొన మొదలు పెట్టిరి. ఇది అబద్ధము.

వీరు ముఖ్యముగ కన్నపుచోరీలు, చోరీలు చేయుటలో కడునేర్పరులు. వీరిలో నొకశాఖయని చెప్పుకొను మార్వారి లేక గుజరాతి బౌరియాలు, తప్పునాణెములుచేసి, మార్చు టలో నేర్పరులు.

వీరు కన్నములు వేయదలచిన గ్రామములకు, పట్టణము లకు సమీపమందుండు మంటపములలోగాని, తోటలలోగాని నిలిచి, బిచ్చమెత్తు మిషపైని కన్నము వేయతగిన, ధనికుల యిండ్లకు పోవుదురు. ఇటీవల వీరు ఎక్కువగ మందులు, వాసనద్రవ్యముల పెట్టెలు విక్రయించ మొదలుబెట్టిరి. పట్న ములలోను, పెద్దగ్రామములలోను క్రొత్తగ మిఠాయిదుకాణ ములు పెట్టి, ఈ మిషపై తమవారికి తావిచ్చి, దొంగసొత్తు అతిసులభముగ విక్రయించుచున్నారు. అమాయకులగు యా త్రస్థులకును, వీరికినిగల భేదము తెలిసికొనుట బహుకష్టము.

1. వీరు సంకరమగు గుజరాతి భాష మాట్లాడుదురు.

2. వీరు యితరులకు తెలియకుండ పూజచేయుటకో లేక శకునములుచూచుకొనుటకో గోధుమగింజలు, జొన్నగిం జలు గల చిన్నయిత్తడి లేక సీనారేకు డబ్బితమతో తీసికొని పోదురు.

3. సాధారణముగ జందెము వేసికొనరు.

4. వీరికి గోత్రములు లేవు. గోసాయిలకు, బైరాగుల కుగల గోత్రములు చెప్పజాలరు.

వీరిని పోల్చుటకు పైనచెప్పిన 3, 4 అంశములు ఇప్పుడంతగ నుపయోగించవు. వీరిలోయిప్పుడు ఎక్కువమంది జందెములు వేయుచున్నారు. అదిలేకున్నవీరి మారువేషము పూర్తిగాదు. అంతేగాక, యిప్పుడిప్పుడు, అడిగినవెంటనే వీరు తమగోత్రములను గురించియు తమదేశమును గురించియు చెప్పుటలో వెనుకదీయక బొంకుచున్నారు.వీరు మాంసము తినుటయు, కల్లుసారాయిలు అమితముగ త్రాగుటయు జాగ్రత్తగ కనిపెట్టిచూచిన వీరు నిజముగు బైరాగులుకారని చెప్పవచ్చును.

వీరెల్లప్పుడు తమ భార్యాబిడ్డలతో ప్రయాణము చేయుదురు. మామూలుగ గ్రామముల బైటనుండు మంటపములలోను, తోటలలోను, దిగి పగటివేళ తమ వేషములకు తగినట్లు మందులమ్ముకొనుటకో, బిచ్చమెత్తుకొనుటకో గ్రామములలోనికి పోదురు. వీరు కన్నములు వేయుటకు తగిన యిండ్లను వెన్నెలరాత్రులలో చూచుకొని, వెన్నెలకాలము గడచినపిమ్మట మరియొకచోటికి పోదురు. చీకటిరాత్రులలో పిన్నలు తమ దేవతలకు మ్రొక్కి, కన్నము వేయదగిన యిండ్లకు బయలు దేరుదురు. అప్పుడీగుంపువారు మకాము లోలేని తమవారినిగురించి అడిగినవారికి సమాధానము చెప్పుటకై మనిషిపొడుగున రాళ్లు పరచి దానిపై బట్టకప్పి అలసి గాఢముగ నిద్రించుచున్నారందురు. వీరుతిరుగు ప్రదేశములలో సమాచారముల నిచ్చువారి నెంతమాత్రము నమ్మక

తమంతటతామే సమాచారములు తెలిసికొందురు. గడియ వద్ద గోడకు కన్నముయున్న నది బారియాలు త్రవ్విన కన్న మని చెప్పుదురుగాని ఈ రాజధానిలో జోగివాండ్రు, ఏనాదులు మొదలగువారుకూడ ఈరీతిగనే కన్నములు త్రవ్వుట చేత దీనినంతగ పాటించ వీలులేదు. ఈవిధముగ లోపల ప్రవేసించుటకు "బగ్లీ" అనిపేరు. తరుచుగ గడపక్రింద కన్నముత్రవ్వి యింటిలోనికి ప్రవేశింతురు. కిటికీలలోని యినుప కమ్ములు బలవంతముగవంచి పైకిలాగికూడ యిండ్లలో ప్రవేశింతురు. ఆస్తియుంచిన సరియైన స్థలము వీరికి తెలిసిన దాని దగ్గిరగ గోడకు కన్నముత్రవ్వి నిద్రించు స్త్రీల నగలు తీయుటలో ఋగుల నేర్పరులు. వీరు బంగారు సరుదులు కంచులు దొంగిలించ ప్రయత్నించుదురు. తమతో మైనపుముద్ద దూది పట్టుకొనివెళ్ళి వాటిని శత్తిగజేసి నుపయోగింతురు. ఒక గదిలో ప్రవేశించునప్పుడు దీపము వెలిగించిగాని గింజలు చల్లిగాని ఆస్తియుండు స్థలములు వీరు తెలిసికొందురు. నేరములుచేయ పోవునప్పుడుగాని నేరములుచేసి వచ్చునప్పుడు గాని, దున్నపోతుయొక్కగాని గాడిదయొక్కగాని చెవికోసి, నేరముచేసిన స్థలమందు మలవిసర్జనము చేయుదురు. ఇట్లు వీ రెందుకు చేయుదురో తెలియదు.

వీరు గునపపు మొనవలె నొకవైపున మొనగల్గి రెండవ వైపున లావుగను, మొద్దుగను, ఉండు ఇనుపపనిముట్టు నొకటి తీసుకొని పోదురు. తమ సామానులు మోసికొని పోవు గుఱ్ఱములను కట్టుటకు రాటగ దీని నుపయోగించు

నట్లు చెప్పెదురు. బైరాగుల వేషము వేసినప్పుడు దీనినుంచు
కొనక జ్ఞాన్ అను పేరుగల యినుపపనిముట్టు తీసికొనిపోదురు.
అది $11\frac{1}{2}$ మొదలు 12 అంగుళములవరకు పొడుగుగలిగి ఒక
వైపున మూడుఅంగుళముల మొనగల ఉక్కుపొన్ను వేయ
బడియుండును. రెండవకొన చిప్పవలె నుండును ఆమొనతో
పొయ్యిత్రవ్వకొని చిప్పవలె నుండుదానితో వండుకొనునట్లు
చెప్పుదురుకాని ఈగుంపువారొక రిద్దరు దీనిని తీసికొనిపోవుట
యొకవిచిత్రము. క్రొత్త మనుష్యుల ఎదుట "జ్ఞాన్"ను ఒకమ
నిషిని పిలిచినట్టుగ 'జ్ఞాన్ దాస్"అని చెప్పెదురు. వీరు దీనిని
తమమూటలలో దాచుటయు, దిగియుండు స్థలములవద్ద పాతి
పెట్టుటయుగూడ గలదు. తమ ఆత్మసంరక్షణకై వీరొక
"నత్రీ"అను కత్తిగూడ తీసుకొని పోదురు.

వీరుక్రింద దెల్పురీతిని తప్పునాణెములు చేయుదురు.
జల్లించి బాగుచేసిన బంకమన్నుతో రెండంగుళములచతురము
ఒకఅంగుళము మందముగల రెండుదిమ్మలుగల అచ్చుచేసి
క్రిందదిమ్మయొక్క మట్టమున ఐమూలగ రెండుప్రక్కల పైది
మ్మలోని చిల్లులు పట్టులాగున రెండుచిన్నచీలల నాటుదురు.
రెండుదిమ్మలకు లోతట్టున రూపాయికంటె కొంచెము పెద్దది
గనుండు గుంటదొలిచి క్రిందిదిమ్మ గుంటలోనికి కరిగినలోహ
ముపోవులాగున గాడీలేర్పరచుదురు. పిమ్మట కొంచెము తేన
యుఒకవిధమగు రాతిపొడియు బాగుగకల్పి దాని నాగుంటలో
నుంచి ఒకరూపాయ నీగుంటలమధ్యనుంచి, దిమ్మలనొక్కి
అచ్చుతయారుచేసి, తిరిగి రూపాయను తీసివేయుదురు. సత్తు,

తగరము, కొంచెము రాగియు కల్పి కరిగించిన లోహము ఆగాడీల గుండ గుంటలోనికి పోసి నాణెముచేసి దానిని మంచినాణెము తో కల్పిపట్టుకొని దానిచుట్టుయున్న గీతలవలెనె సూటిగ ఈ తప్పునాణెముపైకూడ గీయుదురు.

తప్పునాణెములుచేయు బౌరియాలు సంసారములతో ప్రయాణము చేయుదురు. వీరు యాత్రస్థులమని చెప్పుకొన్న టయేగాని వేషమేమియు వేయరు. వీరిని సోదాచేయునప్పుడు అసలుఅచ్చులు మనకు దొరకక, గుండ్రముగ గుంటలు దొలు వబడిన దిమ్మలుమాత్రము దొరుకును. ఒకప్పుడు వీరివెంట వచ్చు స్త్రీలవద్ద నుండును. తప్పునాణెములు మోసపర్చి మార్చునప్పుడు చేతిలో ఆకు మొదలగు వస్తువు నొకదానిని యుంచుకొందురని జెప్పుదురు.

వీరేదైనకొని ఈ దేశములో మారని ఫరక్ బాడ్ రూపాయ నిత్తురు. అది చెల్లదని అంగడివారు చెప్పినప్పుడు చెలామణియగు నాణెము చూపమని అడిగి పుచ్చుకొని తిరిగి యిచ్చునప్పుడొక తప్పునాణెము అతినేర్పుగ నిత్తురు.

వీరివద్దనుండు కర్రలోనాణెములు దాచుదురు. ఎక్కువ నాణెములు ధోవతికి ముందువైపున మడతలలోనుండు సంచి లోవేసి యుంచుదురు. కుడితొడకు క్రిందుగ మరియొకసంచి యుండును. ధోవతి, కచ్చ రెండవ సంచిపైబడి, ముడుతలేర్ప డులాగున కుడితొడకడ్డముగ, దోపుదురు. తప్పునాణెములు 'లనూరియా'అని 'ఫొగ్రి'అని బిలతురు. వీరు తప్పుమొహరు

లుగూడ చేయుదురు. వీరివద్ద నెక్కువగ యినుపగరిటెలుం డును. వీటిని చూచిన మామూలుగ మన్ను ఉడకబెట్టిన గుర్తులుండును.

వెనుకనుండు తమగుంపువారు సులభముగ వీరిని వెంబడించి కలుసుకొనులాగున వీరిస్త్రీలు నడచిపోవుచు మార్గములో పాముప్రాకిన చారవలెనుండు కొంకిరిగీతలు కర్రతో గీయుదురు. పురుషులుగూడ అచ్చటచ్చట పచ్చియాకు నొకదానిని రోడ్డుప్రక్కను వేసి దానిపై నొకరాయిపెట్టి, తమజాడల వారికి దెల్పుదురు.

వీరందరికి పుట్టినపుడు కాల్చిన మచ్చలు మూడుచోట్ల నుండును. బొడ్డు సమీపముననమాత్రము ఉండవు. ఇవి పెద్దవిగను స్పష్టముగను ఉండును. ఇవిగాక స్త్రీలందరకు రెండు కండ్లకు వెలుపలి కొనలందును, ఎడమకంటికి లోపలకొలికియందును, ఎడమచెంపను, గడ్డముపైనను, అయిదుచోట్ల పచ్చపొడిచియుండును.

వీరు వివాహనిబంధనల నిర్బంధములేని నీతిదూరులు. పురుషులు పెక్కుభార్యల పెండ్లాడవచ్చునుగాని స్త్రీలు మాత్రము ఒకనికంటె నెక్కువమందిని వివాహమాడరాదు. మిక్కిలి ప్రియమగుభార్య గృహయజమానిగ నుండును. వీరు తమగుంపు స్త్రీలతో వ్యభిచరించవచ్చును. విడిచిపెట్టబడిన స్త్రీ తిరిగి వివాహమాడకూడదుగాని ఆమె భర్తమాత్రము ఆమెకొక కడియమువేసి, కులమువారందరికి విందుచేసి తిర్గి

ఆమెను ఏలుకొనవచ్చును. దాయాదులను వివాహమాడ వచ్చును.

---

IV ప్రకరణము.

# ఇరానీలు.

హిందూదేశమున వీరిని ఇరానీలని బిలుతురు. పూర్వము పరిష్యాదేశమునకు "యిరాన్"అను పేరుండుటచే వీరాదేశపువారని ఊహించవచ్చును. వీరిని 'బెలూచీలు, హిరాబీలు మగ్రానీలు, కాబూలీలు పఠానులు' అని అనేకవిధముల పిలుచుచున్నను వీరివాసస్థానము ఆఫ్గన్‌స్థానము బెలూచిస్థానముగ నూహించుట పొరబాటు.

వీరు హిమవత్పర్వతము మొదలు కన్యాకుమారీ (కేప్ కామరిన్) వరకు హిందుదేశమందంతట నిర్భయముగ నేరములుచేయుచు ప్రజల నూరక బెదరించుచు పెద్దపట్టణముల యందును గ్రామములయందును కొద్దికాలమూగుచు ఎడతెగక ప్రయాణము చేయుచుందురు. వీరు సామాను తీసికొనిపోవుటకు కుదుర్చుకొనిన బండ్లబాడిగకూడ నియ్యరు. వీరు పోయినదేచాలునని గ్రామస్థులు బాడిగ లేకయే వీరికి బండ్లు కట్టుదురు. వీరిస్త్రీల మోటుతనము, మూర్ఖత్వము, కలహమాడు స్వభావము, వీరిపిల్లల దుడుకుతనము, దుర్మార్గతయు, వీరు దిగియుండు స్థలముల బాగుగ చూడనగును.

వీరు దృఢకాయులు, కష్టముసహింపగల బలాఢ్యు లును. వీరిలోకొందరు జెట్టీలు, ఫైల్‌మానులు. వీరు లుంగీలు కట్టుకొని మహమ్మదీయులవలె చొక్కాల తొడుగుదురు. వీరి కుడితినీలు ఒదులుగనుండి భుజములపై వెడల్పుగ కుట్టబడి యుండును. ఒకప్పుడు బుట్టాలువేసిన చేతులులేని చొక్కాలు దొడుగుదురు. కాబూలీలు తొడుగులాగున ఒదులుగనుండు లాగులు తొడగరు. లోపల చిన్నటోపి పెట్టుకొనకయే తలకుపాగా చుట్టుదురు. యిప్పుడిప్పుడు వీరు పట్టుగుడ్డ తలరు మాలుకు చొక్కాలకుగూడ నుపయోగించుచున్నారు. వీరి చెవులకు కుట్లుండుటచే కొందరు చెవికి పోగులు పెట్టుకొం దురు. బంగారముతోగాని, వెండితోగాని, చేయఁబడిన రక్షరే కుల హారములు ధరింతురు. వీరికి ముందరిజుట్టుండును. వీరి స్త్రీలు అందకత్తెలు, శక్తి సామర్థ్యము గలవారు వీరు. తమ పురుషులకంటె ఎక్కువ తెలివైనవారు. విచిత్రమగు దుస్తులు ధరింతురు. పలురంగుల చీటిగుడ్డతో విశేషముగ కుచ్చెళ్ళు వచ్చులాగున పెద్దతహాబందు కుట్టి కట్టుకొందురు దీనికి వెనుకప్రక్క జేబులుండుటచే చిన్నవస్తువులు, ఇతరదొంగ సొత్తునువాటిలో దాయుదురు,చదరపుగుడ్డ నొకదానిని ఐమూ లగమడిచి రెండుకొనలు వ్రేలాడులాగున తలచుట్టు కట్టుదురు ఈగుడ్డను "కసవ" అందురు. హిందూస్త్రీలవలె చీరెలు కట్ట రు. తమముఖమున కిరువైపుల ముందుప్రక్కను పొడుగాటి జెడల నల్లుకొందురు. బులాకీలు, చెవిపోగులు, ముంగురులు కడియములు మొదలగుకొన్ని మోటునగలుకూడ పెట్టుకొం

దురు. అరబ్బీ అక్షరములుగల వెండిరక్షరేకులుగాని వెండినాణెములుగానిగల హారములు ధరింతురు. పిల్లలు వెండికడియములు కంటెలు, పెట్టుకొందురు. స్త్రీపురుషులందరును పచ్చబొడిపించుకొందురు. వీరు స్నానముచేయకపోవుటచే వీరిదేహములు బట్టలు, మురికిగనుండి విస్తారముగ కంపుకొట్టుచుండును.

వీరు చిన్నగుడారములు, వంటపాత్రములు, వ్యాపార, సామగ్రులు, మురికిబట్టలు, పిట్టపంజరములు, పందెపుకోళ్ళు, కుక్కలు మొదలగునవి తమతో తీసికొనిపోదురు. వీరు తాము దిగియుండుస్థలములలో మహమ్మదీయులతో స్నేహముచేసి, అడిగినసొమ్మిచ్చి వారి పిల్లలనుకొనుక్కొని పెండ్లాడుదురు. ఒకప్పుడు విశేషముగ తిండిపెట్టి, తిండియరపై వయస్సువచ్చిన పడుచులకూడ తమలో కలుపుకొందురు. మరికొన్నిసమయముల అన్నవస్త్రములులేని బీదస్త్రీలుగూడ వీరిగుంపులో జేరుదురు. వీరెక్కువ తిండిపోతులగుటచే తమ వంటకములలో నేతిని నీటివలె వాడుదురు. వీరందరుకలిసి ఒక కంచములోనే తిందురు. స్త్రీపురుషులు హుక్కాపీల్చుదురు.

కత్తులు, కత్తెర్లు తాళములు, మాయరాళ్ళు మాయముత్యములు, చిల్లరవస్తువులు. బొమ్మలు, పూసలు, సులోచనములు, పాదరసముతోచేయుబడిన అనేకరకములనాణెములు మొదలగునవి ఒకతోలుసంచిలో పెట్టుకొనిపోయి బజారులో దుకాణముపెట్టి స్త్రీపురుషులు అమ్ముదురు. ఒకానొకసమయమందు వీరు యింటింటికికూడ తిరిగి విక్రయింతురు.

వీరిలో పురుషులు చోరీ, దోపిడి, బందిపోటు, దగా మొదలగు నేరములు చేయుదురు. స్త్రీలు స్వల్పచోరీలు చేయుదురు. పిల్లలు కోళ్ళు, గొర్రెలు, దొంగిలింతురు. క్రొత్తగ తమగుంపులో జేర్చుకొనిన స్త్రీలకు, చోరీలు చేయుక్రమము పురుషులే నేర్పుదురు. వీరి దేశములో విక్రయించు నాణెములు బొంబాయిలో మార్వారీబజారులో కొనునట్లు తెలియును. ఈ నాణెములు కలకత్తాలోను, నాగపూరులోనుకూడ చేయబడుచున్నవి.

వీరు నాలుగువిధముల నాణెములు విక్రయింతురు.

1 'అల్లా, మహమ్మద్, ఆలీ, ఫాతీమా, హాసన్, హుస్సేను' అను పవిత్రమైన అయిదు నామములుగల నాణెము. దానిని 'పంజతన్' నాణెమందురు.

2 'ఆబూబకార్, ఊమర్, ఊస్మాన్, ఆలీ' అను నలుగురు కాలీఫ్‌ల నామములు ఒకవైపున యరబ్బీభాషలోనుండి మరియొకవైపున 'లాఇలాహా, ఇల్లల్లా, మహమ్మద్ రసులుల్లా' అను కలీమాయుండు నాణెము. దానిని 'చార్యార్' నాణెమందురు.

3 అక్బర్ చక్రవర్తి పేరు, సింహాసనమున కెక్కిన తేదియు నొకవైపునను, రెండవవైపునకలీమాయుండు నాణెము. దానిని 'అక్బర్' నాణెమందురు.

4 సీతారాముల బొమ్మలుగల నాణెము. దానిని 'రామచంద్ర' నాణెమందురు.

ఇవి యిండ్లలోనున్న రుగ్మతలు, దృష్టిదోషములు మొదలగునవి కలుగక భాగ్యమునిచ్చు గొప్పమంత్రశక్తి వీటికి గలదని భావించి హిందువులును, తురకలునుగూడ ఎక్కువ వెల పెట్టికొని తమపిల్లలకు రక్షరేకులుగ మెడలో కట్టుదురు. ఈనాణెములు మాత్రమేగాక పురాతనపు హైదరాబాదు రూపాయలు, బీజపూర్ ఆర్కాటురూపాయలుకూడ వీరు విక్రయింతురు.

వీరుపోవు ప్రతిస్థలమందును నేరములు చేయుదురు. వీరి వద్ద బీగముల గుత్తులుండును. వాటితో యిండ్లతల్పులు తెరిచి లోపలప్రవేశించి దొరికినయాస్తినంతయు దొంగిలింతురు. గ్రామస్థులను భయపెట్టి సొమ్ము పుచ్చుకొందురు. టపామోయువారిని కొట్టి సంచులు దోచుదురు. ఒకప్పుడు టిక్కెట్లుకొనకుండ రైలుపై ప్రయాణము చేయుదురు. ఒకప్పుడు కొన్ని టికెట్లుమాత్రము కొని తమ మురికిమూటలు, గుడారములు, పంజరములు, మొదలగునవి గదినిండా నింపుదురు. స్టేషను మాష్టరు ఆటంకపర్చిన వానినిబట్టి కొట్టబోవుదురు. బజారులలో అంగడివారిని పలువిధముల మోసపుచ్చుదురు.

వీరిస్త్రీలకు నేరములు జేయుటలో వారిలంగా బాగుగ నుపయోగపడును. దానిని భూమిపై గుడారమువలె వేసి కూర్చుని దొంగవస్తువులను వెనుకనుండు మరియొకతె అందుకొన వీలగులాగున లంగాలోపల జారవిడుతురు. యిద్దరు ముగ్గురుస్త్రీలు తమపిల్లలతో దాహామడుగు మిషపై నొక

యింటిలోనికి పోదురు. ఆయింటివారు అమాయకముగ వీరికే మాత్రము కనబడిన వీరిలోనొకరై తనతో తీసికొనిపోయిన నాణెములు చూపించుచు వాటిమహత్తునుగురించి చెప్పమొదలుపెట్టును. మిగిలినవారు యింటివారికి తెలియకుండ లోనికి వెళ్లి విలువగలవస్తువులను దొంగిలించి తమలంగాల జేబులలో దాయుదురు. పిల్లలు బియ్యము పప్పు మొదలగు దినుసులు ఎత్తుకొని పారిపోదురు. ఇంటివారు కోపించియడిగిన ఆకలి తాళలేక తీసిరేమోయని అందురు. రైలుపైకూడ తమపిల్లలసహాయముచే నేరములుచేసి పట్టుబడినప్పుడు యితరులు తమ దగ్గిరకు రాలేనంత దౌర్జన్యము చేయుదురు. వీరిని సోదాచేయ ప్రయత్నించిన కోపావేశులై అందరికిని భయముపుట్టునంత అల్లకల్లోలము చేయుదురు. పిల్లలను రైలుగవాక్షములగుండ పారవేయ ప్రయత్నించుదురు. పట్టణములలోని కూరలబజారులు పండ్లదుకాణములు కొల్లగొట్టి తమ్మెవరైన ఎదుర్కొనిన తమపిల్లలతలలు నేలపైకొట్ట ప్రయిత్నించుదురు.

ప్రతిగుంపువారు తమగుంపున కొక్కొక్క నాయకుని ఎన్నుకొని వానిని 'జమాదారని' బిలుతురు. అతడు చనిపోయినప్పుడుగాని, ముసలివాడైనప్పుడుగాని, మరియొకని నియమించుకొందురు. గుంపులో నిట్టి మార్పులు తరుచుగ నుండుటచే వీరిని గుర్తించుట కష్టముగ నుండును.

వీరు దొంగసొత్తు సమముగ పంచుకొనరు. తమలో దివాలాతీసినవారికి వడ్డీలేకుండ కొంతసొమ్ము అప్పుగనిత్తురు.

గుంపు మొత్తమునకగు ఖర్చులు సమముగ అందరును పెట్టు
కొందురు. దొంగసొత్తు చెట్టుక్రిందనో పొలిమేర రాళ్లక్రిందనో
పూడ్చుదురు. అందుచేత పోలీసువారు సోదా చేసినను వీరివద్ద
నేమియు దొరకదు. గుంపువారొకరిద్దరు దొంగసొత్తుతో చెన్న
పట్టణముగాని బొంబాయిగాని పోయి అచ్చట దానిని విక్ర
యింతురు.

వీరిలో వ్యభిచారము కడునీచమగు నేరము. వ్యభిచ
రించినవారికి అపరాధము విధించియు, కులమునుండి వెలివే
సియు, కొట్టియు, దండించుదురు.

---

## ఏ.

1911 సంవత్సరపు 3 నెంబరు క్రిమినల్ ట్రైబ్సుఆక్టు 3 వ శెక్షనుక్రింద సీదిగువజూపు గ్యాంగులు జామీనుపుచ్చుకొనగూడని గొప్ప నేరములుచేయు జాతులుగ ప్రకటింపబడినవి.

| నెంబరు. | నేరపుజాతిపేరు. | సంచరించుజిల్లాలు. | నేరపుజాతిగ ప్రకటింపబడిన తేది. |
|---|---|---|---|
| 1 | దొంగఎరుకలవాండ్రు | గోదావరి, గుంటూరు, నెల్లూరు, కర్నూలు. | 10-5-1913 |
| 2 | నవాబుపేట కొరచవాండ్రు | కడప, నెల్లూరు, ఉత్తరార్కాటు, చిత్తూరు అనంతపురం, చెంగల్పట్టు. | డిటో |
| 3 | దొంగదాసర్లు | గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, కర్నూలు. | డిటో |
| 4 | వేపూరి మాలవాండ్రు | దక్షిణార్కాటు. | 4-6-1913 |
| 5 | దొంగవడ్డర్లు | కృష్ణా, గుంటూరు, నెల్లూరు, కడప, కర్నూలు అనంతపురం. | 12-6-1913 |
| 6 | కేపుమారీలు | ఉత్తరార్కాటు, కడప, సేలం, దక్షిణార్కాటు, చెంగల్పట్టు, తిరుచనాపల్లి. | 18-6-1913 |

| | | | |
|---|---|---|---|
| 7 | రుద్రపాదం కొరచవాండ్రు | బళ్లారి. | 5-7-1913 |
| 8 | దొమ్మరవాండ్రు | నెల్లూరు. | 13-8-1913 |
| 9 | సేలంమేలూర్ నాడ్ కొరవలు | ఉత్తరార్కాటు, సేలం, కోయంబత్తూర్, తిరుచనాపల్లి. | 14-8-1913 |
| 10 | ఆత్తూర్ కీల్ నాడ్ కొరవలు | సేలం,దక్షిణార్కాటు,తిరుచనాపల్లి. | 13-10-1913 |
| 11 | నక్కలవాండ్రు | గోదావరి. | 21-10-1913 |
| 12 | గంధర్వకోట కొరవలు | తంజావూరు. | 9-12-1913 |
| 13 | వంగనూరుమాలవాండ్రు | నెల్లూరు, చిత్తూరు, ఉత్తరార్కాటు, చెంగల్పట్టు. | 14-2-1914 |
| 14 | జోగివాండ్రు | నెల్లూరు, చిత్తూరు, ఉత్తరార్కాటు, చెంగల్పట్టు, దక్షిణార్కాటు. | 21-2-1914 |
| 15 | కూలికి రహస్యముగ ఖూనీలు చేయు 28గురు గల యొకగుంపు | కడప, కర్నూలు, అనంతపురం. | 21-3-1914 |
| 16 | కీలగుడి కళ్లర్లు | మధుర. | 4-5-1914 |

| | | | |
|---|---|---|---|
| 17 | కొండదొరలు | విశాఖపట్నం. | 21-7-9141 |
| 18 | వెల్లయర్కుప్పం పడయాచీలు | దక్షిణార్కాటు. | 14-11-1914 |
| 19 | కుట్టపాల్ కళ్ళర్లు | తిరుచనాపల్లి, తంజావూరు. | 6-1-1915 |
| 20 | చెట్టినాడ్ వెల్లమూర్లు | రామనాడ్. | 1-5-1915 |
| 21 | రెల్లి వాండ్రు | విశాఖపట్నం. | 4-5-1915 |
| 22 | సోరిక్కంపట్టి, మేలఉరప్పనూర్, పుసలాపురం } కళ్ళనులు | మధుర. | 16-9-1915 |
| 23 | ఉప్పుకొరవలు | తిరునల్వేలి. | 12-10-1915 |

ఈ ఆక్టు 10 (బి) శిక్ష నుక్రింద నీ నేరములు చేయు జాతులు తమ నివాసస్థలము, అందుల మార్పులు, గైరుహాజరు వగైరాలు తెలియపర్చవలయును.

బి.

# సి. ఐ. డి. గ్యాంగులపట్టీ.

| నెంబరు. | జిల్లాపేరు. | గ్యాంగుపేరు. |
|---|---|---|
| 1 | నెల్లూరు | కత్తెరవాండ్రు |
| 2 | కర్నూలు | దొంగదాసర్లు |
| 3 | గోదావరి | పచ్చొపవాండ్రు |
| 4 | గోదావరి | దొంగఎరుకలవాండ్రు |
| 5 | నెల్లూరు | డిట్టో |
| 6 | గుంటూరు | డిట్టో |
| 7 | నెల్లూరు | దొమ్మరవాండ్రు |
| 8 | గుంటూరు | దొంగఎరుకలవాండ్రు |
| 9 | డిట్టో | డిట్టో |
| 10 | నెల్లూరు | డిట్టో |
| 11 | గుంటూరు | దొంగవడ్డర్లు |
| 12 | దక్షిణజిల్లాలు | తోటియానాయకులు |
| 13 | కర్నూలు | దొంగఎరుకలవాండ్రు |
| 14 | డిట్టో | దొంగవడ్డర్లు |
| 15 | చిత్తూరు | నవాబుపేట కొరచవాండ్రు |
| 16 | బళ్లారి | రుద్రపాదం కొరచవాండ్రు |
| 17 | దక్షిణార్కాటు | వేపూరు మాలవాండ్రు |
| 18 | బళ్లారి | |
| 19 | కడప | దొంగదాసర్లు |
| 20 | చిత్తూరు | |

## సిం

## 1911 సంవత్సరపు 3 నెంబరు క్రిమినల్ ట్రైబ్సు ఆక్టు 16వ శెక్షనుక్రింద సెటిల్‌మెంట్లలో నుంచబడిన నేరములుచేయు జాతులు.

| నెంబరు | జిల్లాపేరు. | సెటిల్‌మెంటుయున్న గ్రామముపేరు. | సెటిల్‌మెంటులోనున్న గ్యాంగులపేర్లు. |
|---|---|---|---|
| 1 | గుంటూరు | సీతానగరము | దొంగఎరుకలవాండ్రు, నవాబుపేట కొరచవాండ్రు |
| | | బాపట్ల | దొంగఎరుకలవాండ్రు |
| | | స్టూఆర్టుపురమనే బేతపూడి | డిటో యానాదులు |
| 2 | నెల్లూరు | కావలి | దొంగఎరుకలవాండ్రు |
| | | కలిచేడు | దొంగదాసర్లు, దొమ్మరవాండ్రు |
| 3 | చిత్తూరు | బొమ్మనిగడ్డ | దొంగఎరుకలవాండ్రు |
| | | | నబాబుపేట కొరచవాండ్రు |
| 4 | బళ్ళారి | రుద్రపాదం | కొరచవాండ్రు |
| 5 | దక్షిణార్కాటు | అజీజ్‌నగరం అనే కమ్మాపురం | |
| | | స్టూఆర్టుపురము | వేపూరు మాలవాండ్రు |

# శుద్ధపత్రిక.

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 8 | 20 | వేంకటేశ్వరస్వామి | వెంకటేశ్వరస్వామి |
| 19 | 2 | శమ | తమ |
| 24 | 4 | గ్రహిచ | గ్రహించ |
| 35 | 23 | వీరు | వీరి |
| 51 | 13 | రామనంది | రామానంద |
| 55 | 10 | పస | బస |
| 60 | 16 | మీదకు | మీదను |
| 75 | 12 | పట్టుకొనుటకు | పట్టుకొనుట |
| 76 | 9 | సంబంధమును | సంబంఫములు |
| 84 | 9 | వీరిట్టి | వీరికిట్టి |
| 88 | 17 | గీసియు | గీచియు |
| 89 | 8 | నాతలు | వాతలు |
| 90 | 7 | నగలు | నగలుగాని |
| ,, | 17 | జెల్లికుట్టు | జెల్లికట్టు |
| 92 | 1 | చెవితమ్మి | చెవితమ్మె |
| 106 | 18 | కలదు | కలదు. |
| ,, | 19 | చిప్ప | చిప్ప, |

| | | | |
|---|---|---|---|
| 106 | 19 | చిమటా. | చిమటా, |
| 112 | 5 | సిసము | సీసము |
| 121 | 19 | అప్పుడీ | అప్పుడీ |
| 126 | 7 | హిరాబీలు | హిరాటీలు |
| ,, | 15 | నూడు | మూడు |
| 127 | 13 | గలవారు | గలవారు. |
| ,, | ,, | వీరు. | వీరు |
| 128 | 7 | వ్యాపార, | వ్యాపార |

